LONGEST LIVING NEWSPAPER IN TELUGU JOURNALISM

Visit Internet Edition @ www.zaminryot.com "e-mail : editor@zaminryot.com"

# జమీన్ రైతు



స్థాపకుడు : నెల్లూరు వెంకట్రామానాయుడు | సంపుటి : 71 | సంచిక : 41 | 13.10.2000 శుక్రవారం | 12 పేజీలు | విడిప్రతి : రూ.2.00లు | జీవప్రదాత : నెల్లూరు శ్రీరామమూర్తి

# ముఖ్యమంత్రి బాసలన్నీ మోసాలేనా?

జనవరిలో విద్యుత్ ఛార్జీలు తగ్గించే ప్రతిపాదనేదీ పరిశీలనలో లేదని ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు సూచనప్రాయంగా తెల్పడం ఇటు సాధారణ ప్రజలను, అటు రాజకీయ పరిశీలకులను కూడా ఆశ్చర్యంలో ముంచెత్తుతున్నది. పదవీ ప్రమాణ స్వీకారం చేసి ఏడాది నిండిన సందర్భంగా జరిగిన విలేఖరుల సమావేశంలో ఆయనా ప్రకటన చేశారు. ధరలు తగ్గించే మాటదేముదెరుగు - ధరలు ఇంకా పెరగవు అన్న హామీ సైతం ఇవ్వలేక పోయారాయన.

**జనవరిలో కరెంట్ ఛార్జీలు తగ్గవు; పెరిగినా ఆశ్చర్యం లేదు!**

ఆర్థిక సంస్కరణలు ప్రజల మేలు కోసమేనని; మొదట మొదట అవి కష్టంగా తోచినా వాటి సత్ఫలితాలు నాలుగైదేళ్లలో కన్పించడం ప్రారంభిస్తాయని స్పష్టంగా ప్రకటించారు చంద్రబాబు. రాష్ట్రంలో విద్యుత్ రంగంలో మాత్రమే ప్రధానంగా ఆర్థిక సంస్కరణలు అమలు జరుగుతున్నాయి. ఇప్పటి వరకు జనం అనుభవంలోకి వచ్చిన వాస్తవం - సంస్కరణలు అంటే ధరల పెంపకం మాత్రమే! గత రెండేళ్ల లోనే దాదాపు రెట్టింపు ధరకు పెంచారు. ఆర్థిక సంస్కరణల అమలు కొనసాగి తీరుతుంది అని చెప్పడమంటే - ప్రపంచ బ్యాంకు ఒప్పందాన్ని యథాతథంగా అమలు చేయబోతున్నారనే కదా అర్థం. ఆ ఒప్పందం ప్రకారం వచ్చే నాలుగేళ్లలో వరుసగా పదిశాతం లెక్కన విద్యుత్ రాబడి పెంచి చూపించాలి.

ఛార్జీల తగ్గింపు కోరుతూ ప్రతిపక్షాలు జరిపిన ఆందోళనకు, అసెంబ్లీకి కూడా చంద్రబాబు ఒక హామీ ఇచ్చారు; రేపు జనవరిలో ధరల తగ్గింపు కోరుతూ విద్యుత్ రెగ్యులేటరీ అథారిటీకి ప్రతిపాదనలు సమర్పిస్తామని వాగ్దానం చేశారాయన. ఉద్యమం సమసిపోగానే ఇప్పుడు ప్లేటు ఫిరాయిస్తున్నాడు. జనవరిలో రెగ్యులేటరీ కమీషన్‌కు కేవలం శ్లాబ్‌ల సవరణ కోరుతూ మాత్రమే ప్రతిపాదన ఇస్తారట; శ్లాబ్‌లు సవరిస్తే కొన్ని తరగతుల వారికి ప్రయోజనం కల్గుతుంది కాబట్టి అదే తాము చేయగల్గిన మేలు అని సరిపెట్టుకో మంటున్నారాయన.

ఎంత మోసం? ముఖ్యమంత్రి అంటే పరిపాలనకు అధిపతి; అతడి మాట శాసనం క్రింద లెక్క. ముఖ్యమంత్రి ఒక వాగ్దానం చేస్తే అది ఆచరణ జరిగి తీరుతుందని నమ్మడం సహజం. అందులోనూ అసెంబ్లీ లోపల చేసే ప్రకటనలకు విలువ మరీ జాస్తి. కాని చంద్రబాబు శాసన సభలో ప్రతిపక్షాల వత్తిడి తట్టుకోవడానికి, ఉద్యమ కారులను తప్పుదారిన నడిపించడానికి మాత్రమే ఆనాడా ప్రకటన చేశాడని ఇప్పుడు అర్థమౌతున్నది. ప్రభుత్వ నేత తన మాటలకు చేతలకు పొంతన లేకుండి ప్రవర్తించడం అత్యంత విచారకర పరిణామం.

ప్రజల మేలు కంటే, ప్రజాందోళన పర్యవసానం కంటే ప్రపంచ బ్యాంకు షరతులు పాటించడమే ప్రధానం అని ప్రభుత్వం భావించడం ప్రారంభిస్తే రాష్ట్ర భవిష్యత్ ఏమి కానున్నదోనన్న భయం కల్గుతున్నది. ముఖ్యమంత్రి చేసే బాసలు మోసపు మాటలేనన్న వైఖరి ఇదివరకెప్పుడూ చూడలేదు మనం; ఇక ముందు చూడబోము కూడా! ఇచ్చిన మాట తప్పి ధరల తగ్గింపుకు నిరాకరించినా, మరింత

తొరువ 12వ పేజీలో

# అభాసు పాలైన కాంగ్రెస్!

కాంగ్రెస్ పార్టీ రాష్ట్ర ఎన్నికల కమిటీ నేత కుముద్‌బెన్ జోషికి, పిసిసి నేత సత్యనారాయణ రావుకు మధ్య జరిగిన రభస - రాష్ట్రంలో కాంగ్రెస్ పార్టీ పరువు తీసింది. ఎన్ని ఎదురు దెబ్బలు తిన్నప్పటికీ కాంగ్రెస్ నాయకులలో సఖ్యత మరింత కరువై పోతున్నదే తప్ప ఐక్యత సాధించడం అసాధ్యం అన్న అభిప్రాయం కల్గిస్తున్నదీ పరిణామం.

కుముద్ బెన్ జోషి మాజీ ముఖ్యమంత్రి కోట్ల విజయభాస్కర రెడ్డి వర్గాన్ని పెంచి పోషించడానికి ప్రయత్నిస్తున్నారని సిఎల్‌పి నాయకుడు డాక్టర్ వైఎస్ రాజశేఖర రెడ్డి మొదటి నుంచి ఆరోపణ చేస్తూనే వున్నారు. అందువల్లే ఆయన ఎన్నికల రిటర్నింగ్ ఆఫీసర్ల నియామకం

**వర్కింగ్ కమిటీ ఆరాటంతో వర్గ నేతల కుమ్ములాట**

విషయంలో అంటీ ముట్టనట్లు వ్యవహరించాడు. ఎందరు అడిగినా తన అనుచరుల జాబితా కూడా ఇవ్వలేదు. అయితే పిసిసి అధ్యక్షుడు సత్యనారాయణ రావు తనకు తానుగా కొందరు వైఎస్ అనుచరులకు ఎన్నికల ప్రక్రియలో భాగం కల్పించాడు. వర్గాల విభేధాలు బయట పడకుండా సాధ్యమైనంత వరకు అందర్నీ సర్దుక పోవాలన్నది సత్యనారాయణ రావు గారి వైఖరి. కుముద్ బెన్ జోషి స్వతంత్రించి శ్రీకాకుళం ఎన్నికల అధికారిని మార్చిపారేయడం; గాంధీ భవన్‌ను విస్మరించి గెస్ట్ హౌస్‌లో ఎన్నికల సమీక్షా సమావేశం నిర్వహించడం పిసిసి పెద్దకు కోపం తెప్పించింది. అంతే - ఆయన నేరుగా గెస్ట్‌హౌస్‌కు వెళ్లి జోషి దుమ్ము దులిపేశాడు. దానికి అలిగిన ఆమె తన బాధ్యతను త్యజించి, చెప్పా పెట్టకుండా అహమ్మదాబాద్ విమానం ఎక్కేశారు. వీరిద్దరి జగడంతో కాంగ్రెస్ పార్టీ అభాసుపాలై పోయింది.

జోషి ఇంక తిరిగి రాకుండా చూడడానికి వైఎస్; ఆమెను తిరిగి ఆ బాధ్యతలో కూర్చోబెట్టడానికి కోట్ల ఢిల్లీ

తొరువ 7వ పేజీలో

# ఫ్యాక్షనిస్టుల నియంత్రణ ఎవరితరం?

రాయలసీమ ప్రాంతంలో ప్రభుత్వ కాంట్రాక్టర్లందరికీ ఫ్యాక్షనిస్టుల కబంధ హస్తాల నుంచి విముక్తి ప్రసాదిస్తామని రాష్ట్ర ప్రభుత్వం చేస్తున్న ప్రకటనలు - కేవలం ఉత్తర కుమార ప్రగల్భాలు మాత్రమే. కొన్ని దశాబ్దాల నుంచి పాతుక పోయిన ముఠా నేతల వ్యవస్థను రాత్రికి రాత్రి నాశనం చేయడం అసాధ్యం.

రాయలసీమలో; మరీ ముఖ్యంగా కర్నూలు, అనంతపురం జిల్లాలలో ఫ్యాక్షనిస్టుల ప్రాబల్యం వూడల మర్రి చెట్టు వలె వ్యాపించిపోయి వుంది. గ్రామాలలో ప్రభుత్వ యంత్రాంగం ఉనికి లేకుండా చేసి తమ స్వంత రాజ్యం స్థాపించుకొని వున్నారు ముఠానేతలు. పెన్న, తుంగభద్ర, కృష్ణ నీళ్లతో చేపట్టే ఇరిగేషన్ ప్రాజెక్టులు; కొత్త రైల్వే లైన్ల విస్తరణ వంటి ప్రభుత్వ కార్యక్రమాలు ఈ జిల్లాలలో అధికంగా మంజూరు కావడంతో ఫ్యాక్షనిస్టుల పంట పండుతున్నది. ఇదివరకు వారి ఏకైక ఆదాయ వనరు సారాయి వ్యాపారం మాత్రమే. అప్పట్లో వారు తమ కుటుంబ కక్షలు తీర్చుకోవడానికి; తమ ప్రాణాలు కాపాడుకోవడానికి మాత్రమే ఫ్యాక్షన్ నేరాలు చేసేవారు. కాని ఇప్పుడు పరిస్థితి మారి పోయింది. బైరెడ్డి రాజశేఖర రెడ్డి, చల్లా రామకృష్ణా రెడ్డి, పరిటాల రవి, పార్థసారథి రెడ్డి, బుడ్డా సీతారామ రెడ్డి, కాటసాని రామభూపాల రెడ్డి, కెఇ కృష్ణమూర్తి,

**ముఠానేతలను రాజకీయంగా వెలివేస్తే తప్ప పోలీసు పహరాతో ఫలితం రాదు!**

ఆళ్లగడ్డ ప్రతాప్ రెడ్డి, భూమా నాగిరెడ్డి వంటి ఫ్యాక్షనిస్టు లందరూ నేరుగా రాజకీయాలలోకి వచ్చేశారు; ఎమ్మెల్యేలుగా, ఎమ్పీలుగా, మంత్రులుగా పదవులు పొందారు; హైదరాబాదులో స్థిర నివాసాలేర్పర్చుకున్నారు; ప్యాలెస్‌లను తలదన్నే ఇళ్లు నిర్మించుకొని విలాసాలకు అలవాటు పడిపోయారు. క్రమ క్రమంగా ఫ్యాక్షనిజం బొంబాయి మాఫియా సంస్కృతిని సంతరించు కొన్నది. ఇప్పుడు వీరి మధ్య జరిగే ఘర్షణలకు కారణం పాత కక్షలు కాదు, కుటుంబ కలహాలూ కాదు. కేవలం డబ్బు కోసమే వీరు తుపాకులు సేకరించి, ప్రైవేటు సైన్యాన్ని తయారు చేసి, ఫ్యాక్షన్ నడుపుతున్నారు. కాంట్రాక్టర్ల ప్రమేయం కల్గిన ప్రతి ప్రభుత్వ కార్యక్రమమూ వీరి పాలిట కల్పతరువు వంటిదే.

టెండరు వేయాలన్నా, పని ప్రారంభించాలన్నా, మెషిన్లు నడపాలన్నా, టిప్పర్లు రోడ్డుపై తిరగాలన్నా వీరి అనుమతి తప్పనిసరి. గ్రామాలలో వీరికి సుశిక్షిత సైనిక బలగం వుంది. తిండికి ముఖం వాచిపోయి వుండే పేదలను చేరదీసి, చిల్లర పైసలు ఉదారంగా విదిల్చి, వారి సాయంతో కాంట్రాక్టర్లను గడగడ లాడించి, కోట్లకు కోట్లు కొల్లగొడుతున్నారు వీరు.

తొరువ 7వ పేజీలో

# సణుగుడు

* బందిపోట్లే నయమన్పించారు - పోలీసులు.
* కొత్త ఎస్పీగారైనా చక్కదిద్దుతారా?
* చిన్నబుచ్చుకున్న పెద్ద కుటుంబాలు.

ఉదయగిరి తాలూకాలో దొంగలను పట్టుకోవడానికి కావలి డిఎస్పి నేతృత్వంలో ప్రత్యేక బృందాలు ఏర్పాటు చేస్తున్నట్లు డిఐజి చేసిన ప్రకటనను ఎగతాళి చేశాను గతవారం. అది సంబంధిత పోలీసుల కలుషిత మానసాలలో చిన్న కదలికైనా తెచ్చిందీ లేనిదీ నాకు తెలియదు కాని, వారి ప్రవర్తన ఏ

డోలేంద్ర

మాత్రం మారలేదని ఆ తర్వాతి సంఘటనలు రుజువు చేస్తున్నాయి. గ్రీన్‌గ్లోరి సంస్థను అడ్డం పెట్టుకొని అమాయక వ్యాపారులను హింసించి, కోట్లు కొల్లగొట్టిన వంచకుల బృందానికి నెల్లూరు పాత ఎస్పి నరసయ్య, కావలి డిఎస్పి రెడ్డయ్యలు నేతలుగా వ్యవహరించడంపై ఆవేదన చెంది చేసిన విమర్శ అది. ప్రజలను కాపాడవలసిన పోలీసులే ప్రజలను దోచుకోవడం దారుణం. ఆరు నెలల క్రితం ఈ ఇద్దరు అధికారుల ప్రమేయంతో దుర్మార్గాలు జరిగిపోతున్నాయని ఇదే పత్రికలో వారి చేతిలో బాధలనుభవించిన వారి హాహాకారాలు విన్పిస్తే - ఒక్క ఉన్నతాధికారి పట్టించుకోలేదు. అందుకు ప్రతిగా, ప్రభుత్వం నరసయ్య గారికి ప్రమోషన్ ఇచ్చి గౌరవించింది. ఇప్పుడు ఎవరి ఇళ్లు వారు సర్దుకొని; రుజువులు సాక్ష్యాలు దొరక్కుండా మాయం చేసి; దోచిన డబ్బు భద్రంగా దాచుకున్న తర్వాత సంబంధిత పోలీసు అధికారులను జిల్లా నుంచి బదలీ చేస్తామని ప్రకటించారు - అమాత్యవర్యులు ఆదాల ప్రభాకర రెడ్డి గారు. బదలీ చేస్తే ఏమి జరుగుతుంది? కొత్త నగరంలో, కొత్త మోసగాళ్ల బృందంతో చేతులు కలిపి, మరింతగా పిండుకొంటారు ప్రజల నుంచి!

ఇప్పుడు నేను చెప్పదల్చుకున్న విషయం అది కాదు; ఉదయగిరిలో బందిపోట్లను పట్టుకోవడానికి వెళ్లిన పోలీసులు - ఆయా గ్రామాల ప్రజలలో వీరికంటే బందిపోట్లే నయం అన్న విరక్తి కల్గించి వచ్చారన్న విచారకర వాస్తవం పాఠకులకు ఎరుక పరచడం! సీతారామపురం, సిఎస్ పురం తదితర గ్రామాలలో ఈ ప్రత్యేక బృందాలు జరిపిన అరాచకం అమాయక గ్రామీణులలో భీతావహం సృష్టించింది. బందిపోట్లు తమ చేతికి సులభంగా చిక్కిపోవడంతో వారి నడ్డం పెట్టుకొని వూళ్లపైపడి కొల్లగొట్టారు పోలీసులు. ఇందుకు వారికి చిక్కిన చక్కటి మార్గం - సొత్తు రికవరీ! ఈ గ్రామాలలో వైశ్య కుటుంబాలు ఆర్థికంగా స్థితిమంతమైనవి. కాని వారికి వారి వూరు దాటి బయటి ప్రపంచంతో సంబంధాలు వుండవు; ఎవరి అండా వుండదు. ఇటువంటి వారిని ఎంపిక చేసుకొని మరీ వేధించారు పోలీసులు. వారి ఇళ్లకు వెళ్లి, బందిపోట్ల నుంచి చోరీ సొత్తు కొనుగోలు చేసినట్లు కేసులు పెడతామని బెదరించి, ఆ సమస్య నుంచి తప్పించడానికి రేటు నిర్ణయించి పబ్లిక్‌గా దోపిడీ జరిపారట. ఒక్కొక్కరి నుంచి 50 వేల రూపాయల వరకు గుంజుకున్నారట.

నిజంగా దొంగసొత్తు కొన్నారన్న సందేహం కల్గిన వారిని హింసిస్తే కొంతలో కొంత పోలీసుల సమస్యను అర్థం చేసుకోవచ్చు. నేర విచారణలో, సాక్షాల సేకరణలో చట్టం పరిధిని కొద్దిగా అతిక్రమించక తప్పదని సానుభూతి చూపవచ్చు. కాని మించిన తరుణము దొరకదు అన్నట్లు అమాయకులను వేధించడం; వేలకు వేలు లంచాలు ఇవ్వగానే వదిలిపెట్టడం ఎంత దుర్మార్గం? వీరి ప్రవర్తన చూసిన తర్వాత పోలీసుల కంటే బందిపోట్లే నయం అని ప్రజలు భావించడంలో తప్పు ఏమి వుంది?

* * *

ఇంత ఛండాలంగా తయారైన నెల్లూరు పోలీసు యంత్రాంగాన్ని కొత్త ఎస్పి గారైనా చక్కదిద్దుతారా అన్నది సందేహం. కొత్త ఎస్పి తీరు చూస్తే


గూడూరు వల్లపురెడ్డి శేషిరెడ్డి కుమార్తె సుష్మిత, బుర్లావారిపాళెం బుర్లా దామోదరరెడ్డి కుమారుడు చక్రధర్‌ల వివాహం 8 తేది నెల్లూరు టిటిడిలో జరిగింది.

మాత్రం ఎక్కడో ఆశ మిణుకుమిణుకుమంటున్నది. నక్సలైట్ల హిట్‌లిస్ట్‌లో వున్నారట ఆయన. అందువల్ల ఆయనకు ప్రత్యేక ఎస్కార్ట్ సౌకర్యం కల్పించింది ప్రభుత్వం. నక్సలైట్లు అవినీతిపరులను, ప్రజా పీడకులను తమ శత్రువులుగా భావించే సాంప్రదాయం ఎప్పుడో కనుమరుగైంది. నిజాయితీతో, నిర్భీతితో, చిత్తశుద్ధితో తమ విధులు నిర్వహించే ఉమేష్ చంద్ర, వ్యాస్ వంటి అధికారులపై మాత్రమే వారు కన్నెర్ర చేస్తారన్న వాస్తవం ప్రజలకు బాగా అర్థమైంది. నక్సలైట్లు సమాంతర ప్రభుత్వం నడుపుతున్న తెలంగాణా జిల్లాలలో లంచాలు తింటున్న ఒక్క ప్రభుత్వోద్యోగి అన్నల మందలింపుకు గురైనట్లు వినలేదు మనం ఇటీవలి కాలంలో! పేదలను బానిసలుగా చూసే దొరలను శిక్షించినట్లు కూడా పత్రికల్లో చదవడం లేదు. శ్రీకాకుళం రైతాంగ పోరాటంతోనే; ఇంద్రవెల్లి ఉద్యమంతోనే ఆ ధోరణి ముగిసిపోయినట్లుంది. తమను, తమ అరాచకాలను ఎదిరించే పోలీసులతో మాత్రమే యుద్ధం చేస్తున్నారు అన్నలు.

ఈ కోణం నుంచి చూసినప్పుడు కొత్త ఎస్పి శ్రీనివాస రెడ్డిగారు కూడా వృత్తి ధర్మం పట్ల నిబద్ధత కల్గినవారైనందువల్లే అన్నల ఆగ్రహానికి ఎరగా మారివుంటారని భావించాలి. ఆయన ఆ అడవుల్లో చూపిన కరకుదనం, చురుకుదనాలలో పదోవంతు నెల్లూరులో ప్రదర్శించినా పోలీసు యంత్రాంగం క్షాళన అవుతుంది. గ్రీన్‌గ్లోరి దోపిడీలు వంటివి నిలుస్తాయి; వ్యాపారుల మధ్య పంచాయితీలు జరిపే రౌడీ అడ్డాలుగా మారిన పోలీసు స్టేషన్లు చక్కబడుతాయి.

కొత్త ఎస్పిగారూ - మంచి పనులు చేసి, మంచితనంతో నెల్లూరు

తరువాయి 7వ పేజీలో

# నేతలంటే రోత!

ప్రజాస్వామ్యానికి ప్రాణాధారం - పాలకుల పట్ల నమ్మకం. పాలించేవాడు తమ మేలుకోసం వున్నాడన్న విశ్వాసం ప్రజలలో లోపించిననాడు ఆ వ్యవస్థ మనుగడే అర్థరహితమౌతుంది; అరాచకత్వానికి దారితీస్తుంది. కాని దురదృష్టవశాత్తు మన దేశంలో రాజకీయవాదుల పట్ల అపనమ్మకమే కాదు - అసహ్యం కల్గించే పరిణామాలు జరుగుతున్నాయి.

ఈ ఒక్క వారంలో ఇద్దరు పెద్ద నేతలకు న్యాయస్థానాలలో శిక్షలు పడ్డాయి. ఒకరు మాజీ ప్రధాని, మరొకరు మాజీ ముఖ్యమంత్రిణి. ఇద్దరి నేరం - అవినీతి! తన పదవి నిల్పుకోవడానికి ప్రజాప్రతినిధులను రూకలతో కొనుగోలు చేసిన నేరం మాజీ ప్రధాన మంత్రి పి.వి. నరసింహారావు గారిదైతే; ప్రభుత్వ ఆస్తిని అక్రమంగా కాజేయడానికి తన అధికార పదవిని దుర్వినియోగం చేసిన పాపం - జయలలితది! లంచం ఇచ్చి ఆయన, పుచ్చుకొని ఈమె ప్రజల నమ్మకాన్ని వమ్ము చేశారు. ఇద్దరికీ న్యాయస్థానాలు జైలు శిక్ష విధించాయి.

భారత రాజకీయాలలో అవినీతి ఇప్పటికిప్పుడు పుట్టు కొచ్చింది కాదు. వీరిద్దరే దోషులు, తతిమా వారందరూ సత్యహరిశ్చంద్రులూ కాదు. అవినీతి చెద పురుగు మాదు. నాలుగు దశాబ్దాల క్రితమే రాజకీయ వటవృక్షం వ్రేళ్లపై తిష్టవేసింది. పంచాయతీ సర్పంచ్ నుంచి ప్రధాన మంత్రి వరకు అవినీతికి పాల్పడడం, అక్రమార్జనకు పూనుకోవడం తమ హక్కుగా భావించే దౌర్భాగ్యం సంప్రాప్తింప జేసింది. అయితే రాజకీయ నేతల అవినీతిని నిర్ధారించే అవకాశం న్యాయస్థానాలకు లభించడం మాత్రం ఇప్పుడే కొత్తగా ప్రారంభమైంది. 1972లో ఇందిరా గాంధీ ఏకఛత్రాధిపత్యం ప్రారంభమైనప్పటి నుంచి ఎన్ని వేలు, లక్షల అవినీతి ఆరోపణలు భారత ప్రజల దృష్టికి వచ్చాయో లెక్కలేదు. కాని చట్టంలో లోపాల వల్ల, అసమగ్ర చట్టాల వల్ల అవి పత్రికల్లో వార్తలకు మాత్రమే పరిమితమైనాయి. దానితో రాజకీయవాదుల విచ్చలవిడికి అడ్డుఅదుపు లేకుండా పోయింది. ప్రభుత్వంలో వుండేవారు ఎంత పెద్ద తప్పు చేసినా ప్రశ్నించే వారు వుండరనే ధైర్యం రాజకీయ వాదులకు ఎక్కడలేని బలం చేకూర్చి పెట్టింది. దాని దుష్ఫలితమే - జయలలిత, లల్లూప్రసాద్ యాదవ్, సుఖ్‌రాం వంటి నేతల ఆవిర్భావం.

ప్రభుత్వ పగ్గాలు చేజిక్కిన ప్రక్క క్షణం నుంచి ప్రజాధనం దోచుకోవడమే పరమావధిగా భావిస్తున్నారు పాలకులు. రాష్ట్ర, దేశ స్థాయిలో పాలనాధికారం నెరపిన కొందరు నేతలు మధ్య యుగాలనాటి చక్రవర్తులు, రాజులకంటె దర్జాగా, దర్పంగా బ్రతకడం అలవాటు చేసుకున్నారు. ఇంద్రభవనాల వంటి ఇళ్లు కట్టినా, జమీందారీ విలాసాలలో మునిగితేలినా ఆ డబ్బు ఎక్కడిది అని అడిగేవాడే లేకపోవడంతో అందరిలోనూ ఆ బాధ్యం మహమ్మారివలె వ్యాపించింది. నేతలు ఒక ప్రక్క, అధికారులు మరొక ప్రక్క గాదెక్రింద పంది కొక్కుల వలె చేరి ప్రభుత్వ ఖజానాను ఖాళీ చేయడం సర్వ సాధారణమై పోయింది.

ఇక ఎప్పటికీ ఈ దుర్నీతికి అంతం లేదన్న నిస్పృహ ప్రజలలో ఆవరిస్తున్న సమయంలో వెలువడ్డాయి ఈ రెండు తీర్పులు. కారు చీకట్లో కాంతిరేఖల వలె ప్రజలలో ఆశల దీపాన్ని వెలిగించాయివి! ప్రధానమంత్రి స్థాయిలోని వ్యక్తి నలుగురు ఎమ్పీలకు డబ్బిచ్చి తన కనుకూలంగా ఓటు వేయించు కొన్నందుకు శిక్ష పడడం భారతదేశ చరిత్రలో అపూర్వమైన పరిణామం. ఈ బేరసారాలు రాజకీయాలలో చాలా మామూలు విషయాలన్న అభిప్రాయంలో వుండిన సగటు పౌరుడికి ఇది ఆశ్చర్యమే కాదు, ఆనందం కూడా కల్గిస్తున్నది.

జయలలిత సంగతీ అంతే! భవిష్యత్తులో అధికార దుర్వినియోగానికి పాల్పడబోయే ప్రతి ముఖ్యమంత్రికీ ఆమెకిప్పుడు పడిన శిక్ష ఒక హెచ్చరికవలె పని చేయడం ఖాయం.

అయితే ఈ రెండు కేసుల

జమీన్‌రైతు

దర్యాప్తులో, తదనంతరపు న్యాయ విచారణలో జరిగిన విపరీతపు జాప్యం మాత్రం సహించదగినది కాదు. పుష్కలంగా డబ్బు, చేతిక్రింద చాలినంత మంది న్యాయవాదులు కల్గిన ఈ నేతలు రకరకాల లీగల్ లిటిగేషన్‌లు సృష్టించి తమపై విచారణకు అడుగడుగునా ఆటంకాలు సృష్టించారు. చట్టానికి, రాజ్యాంగానికి చిత్ర విచిత్ర భాష్యాలు చెప్పి తమ రక్షణకు ప్రయత్నించారు. జెఎంఎం ఎమ్పీలు లంచాలు తీసుకున్నారన్న నేరం - వారి బ్యాంకు ఖాతాలలో సొమ్ముతో సహా సిబిఐ దర్యాప్తులో రుజువై నాలుగేళ్లు గడిచింది. జయలలిత భూకుంభకోణం సాక్ష్యాలు దొరికి మూడున్నరేళ్లు గడిచాయి. వారిని దోషులుగా నిర్ధారించడానికి ఇంత సమయం పట్టడం విచారకరం. అవినీతి కేసుల సత్వర విచారణకు ప్రత్యేక కోర్టులు ఏర్పర్చిన ఉద్దేశ్యమే ఈ కాలయాపనతో నీరు గారిపోయింది. ఇప్పటికీ ఇది తుది తీర్పు కాదు. హైకోర్టు, సుప్రీంకోర్టుల అప్పీళ్లకు వెసులుబాటు వుంది కాబట్టి, అక్కడ నిజానిజాల నిర్ధారణ జరగడానికి మరి మూడునాలుగేళ్లు పడుతుంది. అప్పటి వరకు వీరి దోషం రుజువైనా, నిర్దోషుల క్రిందే లెక్క. ఈ లోపు ఎన్నికలు వచ్చి, వీరికి తిరిగి అధికారం సంక్రమిస్తే - ఈ కేసులు ఎప్పటికీ తేలని ప్రశ్నలు గానే కోర్టులలో నిలబడిపోతాయి.

అవినీతిపరులకు అంత సమయానుకూలత కల్పించడం ధర్మంకాదు. రాజకీయవాదులపై వచ్చే ఆరోపణలను విచారించడానికి ఒక నిర్ణీత కాలవ్యవధి నిర్ణయించి, తప్పు చేసినవారు తప్పకుండా శిక్ష అనుభవించే విధంగా చట్టాన్ని తిప్పిరాయడం అవసరం.

ooo

---

జమీన్‌రైతు

13.10.50

వెల: 0-3-0 పేజీలు: 12

## నేను తప్పుజేశాను

"శాసనసభలకు నిలబెట్టకూడని వాండ్లను నిలబెట్టడంలో నేను తప్పు జేశాను" - ప్రకాశం పంతులు.

పశ్చిమ గోదావరి జిల్లా వ్యవసాయ కూలీల మహాసభలో అధ్యక్షుడు బి.ఎస్. మూర్తిగారు మాట్లాడుతూ జమీందారీ రద్దు చట్టం అమలు జరపడంలో కాంగ్రెస్ పెద్దలే స్వార్థము కొసరం దుర్వినియోగం చేస్తున్నారన్నారు.

దీనికి జవాబుగా ప్రకాశం పంతులు గారు మాట్లాడుతూ "దీనికి నా బాధ్యత గూడా కొంత వుంది నేను గూడా తప్పు చేసిన వాండ్లలో ఒకడినే. శాసనసభలకు నిలబెట్టగూడని వాండ్లను నిలబెట్టాము దాని ఫలితం యీనాడు అనుభవిస్తున్నాము".

పంతులు చెప్పిన మాటలు ముమ్మాటికి యదార్థము. ఎవరు తప్పు చేసినా దాని ఫలితం అందరూ అనుభవించవలసిందే. జమీందారీ రద్దు శాసనం శాసనసభకు వచ్చినప్పుడు దానిని ప్రత్యక్షంగా, పరోక్షంగా ప్రతిఘటించిన పెద్దలు అనేక మంది కలరు. కొందరు కాంగ్రెస్ సభ్యులుగాకుండా జమీందారీ బంట్లుగా కూడా వ్యవహరించారు. ఇనాముల విషయములో ఇనాము రైతులకు ఎంతైనా అపకారం చేశారు. ఇందుకు ఒకటి రెండు నిదర్శనాలు: ప్రకాశం పంతులు ప్రధాన శిష్యుడైన శ్రీ తెన్నేటి విశ్వనాథం గారికి తన అన్నగారి కుటుంబం తాలూకు ఒక ఎస్టేటుతో పూర్తి సంబంధమున్నది. అందువల్ల వారు ఈ బిల్లుకు ఎంతైనా ప్రతిఘటించారు. అట్లే మరొక కాంగ్రెస్ సభ్యుడు సెలక్ట్ కమిటీలో అతట్టు మొగ్గినందున ఎన్నో సవరణలను రెవిన్యూ మంత్రి కళా వెంకట్రావు

50 ఏళ్ల క్రితం

క్యాస్టింగ్ ఓటుతో ముగించవలసిన గతి పట్టింది. ఇట్లే ఎందరో ఎన్నో విధాల వ్యతిరేకత చూపెట్టారు. మంచి శాసనసభ్యులు కాంగ్రెసులో నిజాయితీగలవారై యుండినచో ఆ [illegible] అంతదుర్గతి పట్టి యుండెడిదికాదు.

### నెల్లూరు జిల్లా పరిస్థితులు

సరియైన వర్షాలు లేవు. పైరు పచ్చలు అన్ని చోట్లా సరిగ్గా ఎక్కలేదు. ఎక్కిన చోట్ల ఎండిపోతున్నవి. ఆహార ధాన్యాల కొరత జిల్లా అంతటా సర్వే సర్వత్రా వున్నది. చిత్తకార్తెలో వర్షం

తరువాయి 10వ పేజీలో

---

# జనవాణి

# వెంకయ్యా! ఇఫ్కోను సాధించవయ్యా!!

కేంద్ర ప్రభుత్వంలో కేబినెట్ మంత్రి పదవి అలంకరించిన జిల్లావాసి వెంకయ్య నాయుడికి అభినందనలు. గతంలో నెహ్రూజీ హయాంలో జాతీయ కాంగ్రెస్ నాయకునిగా జిల్లాలో సంపన్న వర్గానికి చెందిన బెజవాడ గోపాలరెడ్డి ఆంధ్ర రాష్ట్ర ముఖ్యమంత్రిగా, కేంద్ర మంత్రిగా జిల్లాకు వన్నె తెచ్చారు. తదనంతరం ఇందిరా కాంగ్రెస్ రాజకీయాల్లో రాటుదేలిన మధ్యతరగతి మేధావి నేదురుమల్లి జనార్ధనరెడ్డి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగా జిల్లాకు గుర్తింపు కూర్చారు. ఈ ఇరువురికి భిన్నంగా సామాన్య కుటుంబం నుంచి వచ్చి, ప్రతిపక్ష పార్టీ ప్రతినిధిగా, బిజెపి అగ్రనాయకునిగా వెలిగి నేడు కేంద్రంలో ఉన్నత స్థానాన్ని పొందడం వెంకయ్య నాయుడి ప్రత్యేకత. ప్రజాస్వామ్య విలువల పరిరక్షణకై పలుమార్లు ఉద్యమించిన నాయుడు స్వయంకృషితో పార్టీలోను, ప్రభుత్వంలోను ఉన్నత పదవులు పొందగల్గారు. వెంకయ్య నాయుడు తన ప్రతిభా పాటవాలతో, కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వ నేతలతో వున్న అనుబంధంతో జిల్లాలో అపరిష్కృతంగా మిగిలివున్న పలు సామాజిక, ప్రగతి పనులను పూర్తి చేయించగలరని ఆశిద్దాం. సాంకేతిక పరమైన చిక్కుల సుడిగుండంలో చిక్కుకపోయిన 'ఇఫ్కో' కర్మాగారాన్ని నెల్లూరు దరిచేరిస్తే జిల్లా రైతాంగం, ఉపాధికై ఎదురుచూచే యువత ఎంతగానో ఆనందిస్తారు.

*విశాఖపట్నం* — *ఎం.రామ్మూర్తి*

## చట్టం ముందు అందరూ సమానులే

తన ప్రధాని పదవిని కాపాడుకునేందుకుకొందరు ఎమ్పీలకు ముడుపులిచ్చిన పి.వి. నరసింహారావు కేసును విచారించిన ప్రత్యేక న్యాయస్థానం ఆయన్ను దోషిగా నిర్ణయించింది. ఈ కేసులో ఆయనకు శిక్ష కూడా పడనున్నది. టాన్సీ భూముల కుంభకోణం కేసులో తమిళనాడు మాజీ ముఖ్యమంత్రి జయ లలితకు ఐదేళ్ల కఠిన కారాగారశిక్ష విధించారు. అధికారంలో ఉన్నప్పుడు అడ్డు అదుపు లేకుండా వ్యవహరిస్తే తర్వాత తిప్పలు తప్పు[illegible] ప్రజాస్వామ్య వ్య[illegible] వ్యవస్థ ఇంకా బ్రతికుందని చెప్పేందుకు ఈ కోర్టు తీర్పులే చక్కని ఉదాహరణ.

*గంగవరం* — *జె.రామకృష్ణప్రసాద్*

## ధరలు తగ్గించలేకుంటే దిగిపోండి!

వాజ్‌పాయి ప్రధానిగా దేశం అన్ని రంగాల్లో అభివృద్ధి సాధిస్తుందని ఆశించాం. దేశ ప్రజల ఇబ్బందులు కొంత వరకైనా తగ్గుతాయని భావించాం. కాని ఆశలన్నీ నిరాశలయ్యాయి. నిత్యావసర ధరలు పెరిగిపోతుంటె ప్రభుత్వం ఎంత మాత్రం అదుపుచేయలేక పోతూంది. సామాన్య గృహిణులు ఉపయోగించే గ్యాస్ సిలిండర్ల ధర ఏడాది వ్యవధిలో 150 రూపాయల మేర పెరిగింది. పెట్రోల్ ధరలు పెంచడం వల్ల దీని అనుబంధమైన ఉత్పత్తుల ధరలన్నీ పెరిగిపోయాయి. కిరోసిన్ ధర కూడా పెంచడం మరీ అన్యాయం. ప్రభుత్వానికి ధరలు తగ్గించే సత్తాలేకుంటె దిగిపోవడం మంచిది.

*నెల్లూరు* — *ఆలపాటి అరవింద్*

## సర్పంచులకు విద్యార్హత ఉండాలి

దేశానికి పట్టు[illegible] పంచాయతీలు. ఈ పంచాయతీలకు జరిగే ఎన్నికల్లో పోటీ చేసేందుకు అందరూ అర్హులే. ఇది మంచి పద్ధతే. కాని కనీస విద్యార్హత లేనివాళ్లు సైతం వివిధ పదవులకు పోటీ పడడం బాగోలేదు. ఇటీవల బుచ్చిరెడ్డిపాళెం మండలంలోని ఒక గ్రామ సర్పంచ్ పని తీరు గూర్చి

తరువాయి 10వ పేజీలో

## బోగస్ వికలాంగుల సర్టిఫికేట్లతో

# అయ్యోర్ల ఉద్యోగాలకు దోటి

కూటి కోసం కోటి పాట్లు అన్నట్లు రాక, రాక వచ్చిన అయ్యోర్ల ఉద్యోగాలను దక్కించుకొనేందుకు నిరుద్యోగులు నానాపాట్లు పడుతున్నారు. టీచర్ల ఎంపిక ప్రక్రియ సిఫార్సులకు తావులేకుండా

### డిఎస్‌సి సెలక్షన్‌లో అభ్యర్థుల తంటాలు

ఉంతటంతో వికలాంగుల కోటాలో ఛాన్స్ కొట్టేందుకు కొందరు మార్గం ఎంచుకున్నారు. ఆగష్టు నెలలో జరిగిన టీచర్స్ రిక్రూట్ మెంట్ పరీక్షలో బోగస్ వికలాంగుల సర్టిఫికెట్లతో పలువురు దరఖాస్తులు దాఖలు చేసినట్లు తెలిసింది. వికలాంగుల కోటాలో పోస్టులు కొట్టేయాలన్న నిరుద్యోగుల ఎత్తుగడకు నెల్లూరు ప్రభుత్వాసుపత్రిలో పనిచేసే డాక్టర్ కూడా బాగా సహకరించారు. తప్పుడు సర్టిఫికెట్లు ఇచ్చినందుకు నాలుగైదు లక్షల రూపాయలు వెనకేసుకున్నారు. టీచర్స్ రిక్రూట్‌మెంట్ పరీక్షలో వికలాంగులకు ప్రత్యేక రాయితీలు కల్పించారు. బీయిడి, సెకండరీ గ్రేడ్ టీచర్ ట్రైనింగ్ విద్యార్హత లేకపోయినా ఇంటర్ మీడియట్ చదువుతో వీళ్లు ఈ పరీక్షను వ్రాయవచ్చు. పోస్టుల భర్తీలోనూ మొదటి ప్రాధాన్యత వీరికే కాబట్టి నిరుద్యోగులు ఈ తెలివైన మార్గాన్ని ఎంచుకున్నారు. కుంటి, గుడ్డి, మూగ సర్టిఫికెట్లు దాఖలు చేస్తే అప్లికేషన్ దాఖలు చేసే దశలో

(తరువ 11వ పేజీలో)



జయప్రకాష్ నారాయణ్ జయంతి సభలో మాట్లాడుతున్న అసెంబ్లీ మాజీ స్పీకర్ రేబాల దశరథరామిరెడ్డి, ప్రక్కన ఇళ్ల మంత్రి ఆదాల ప్రభాకర్ రెడ్డి, జస్టిస్ సుదర్శన రెడ్డి, నిర్వాహకుడు పాండురంగారెడ్డి

# నిధుల సౌభాగ్యం ఉన్నా, ముండమోసిన మున్సిపాలిటీ

నెల్లూరు మునిసిపాలిటి పీకల్లోతు ఆర్థిక సంక్షోభంలో కూరుకపోయి వుంది. నిధుల సౌభాగ్యం ఉండి కూడా ముండ మోసింది. ఇక్కడ పనిచేసే అన్ని శాఖల సంక్షోభంలో కూరుకపోవడానికి పాలకుల అసమర్థత, అలక్ష్యంతో పాటు ఉద్యోగుల నిర్లక్ష్యం, భాధ్యతా రాహిత్యం కూడా కారణం. గతంలో మునిసిపల్ రెవిన్యూ

### పాలకుల సిగపట్లు ఖజానాకు సిబ్బంది తూట్లు

ఉద్యోగులకు గత మూడు నెలలకు పైగా జీతాలు చెల్లించలేని దుస్థితి నెలకొనివుంది. దీనివల్ల మునిసిపాలిటీలో చిన్నపని కూడా జరగడం లేదు. మునిసిపాలిటి ఆర్థిక సిబ్బంది ప్రతిదినం 3లక్షల రూపాయల మేర వివిధ వసూళ్లు చేసేవారు. కాని మూడు, నాలుగు నెలలుగా రోజువారీ మునిసిపల్ రెవిన్యూ వసూళ్లు 50వేలకు పడిపోయాయి. కొంత మంది బిల్ కలెక్టర్లకు రోజు వారీ కలక్షన్ బాగానేవున్నా వారు ట్రెజరీలో రెండు, మూడు వేలకు మించి కట్టడం లేదు. వీరు డబ్బులు కట్టించుకొని వ్రాసిస్తున్న రశీదుల్లో ముందు తేదీలను కొందరు వ్రాసిస్తుంటే, మరి

### నెల్లూరుసంగతులు

కొందరు అసలు రాసివ్వడమే లేదు. బిల్లు కలెక్టర్లు ఉత్సాహంగా పనిచేసి, వసూలైన డబ్బు వసూలైనట్లు కడితే ప్రతిరోజు 10లక్షలు మునిసిపల్ ఖాతాలో జమ అవుతాయి. ఈ డబ్బులు మునిసిపల్ సాధారణ ఖర్చులకు సరిపోతాయి. అన్నీ సక్రమంగా జరిగితే మున్సిపాలిటీకి ముండ మోయాల్సిన అవసరం కూడా రాదు. అక్రమ కట్టడాల క్రమబద్ధీకరణ పథకంలో టౌన్ ప్లానింగ్ శాఖ 2కోట్లు 75లక్షల మేర వసూలు చెయాల్సివుంది. మునిసిపల్ కౌన్సిలర్లు, వివిధ రాజకీయ పార్టీల నాయకుల వత్తిడిపైన ఈ వసూళ్లు చేయడంలో టౌన్‌ప్లానింగ్ శాఖ మీన మేషాలు లెక్క పెడుతుంది. సందట్లో సడే

సిబ్బంది మూడు నెలల జీతాలు కావాలని పట్టుపట్టారు. దీంతో జీతాల చెల్లింపులో కూడా ప్రతిష్టంబన ఏర్పడింది. మొత్తం మీద మునిసిపాలిటి 6కోట్ల రూపాయల

### జీతాలకు చిల్లిగవ్వలేదు పనులకు పైసా రాదు

మియాగా ఈ వ్యవహారంలో టౌన్ ప్లానింగ్ శాఖాధికారులు రెండు చేతులా వెనకేసు కొంటున్నారు. వాణిజ్య పన్నుల శాఖ నుంచేగాక వినోద పన్ను పద్దు నుంచి కూడా మునిసిపాలిటీకి కోట్ల రూపాయల మేర బకాయిలు రావాల్సి వుంది. రిజిస్ట్రేషన్‌ల వాటాగా ఈ వారంలో మునిసిపాలిటీకి చెల్లించిన 70 లక్షల పైబడి మొత్తంతో మునిసిపల్ పరిపాలనా సిబ్బందికి 1 నెల జీతం, పారిశుధ్య సిబ్బందికి 2నెలల జీతం చెల్లించను కమీషనర్ ముందు కొచ్చినా, పారిశుధ్య మేర వివిధ రూపంలో పలువురికి బాకీ పడివుంది. రావాల్సిన బకాయిల వసూలుకు ఒక కార్యాచరణ రూపొందిస్తె ఈ బకాయిల చెల్లింపు మునిసిపాలిటీకి పెద్ద కష్టమేమి కాదు.

### ఈ ధరలతో బ్రతికేదెట్లా?

గడచిన మూడు నెలల వ్యవధిలో ఆకాశాన్నంటిన వివిధ నిత్యావసరాల ధరలు సామాన్య, మధ్య తరగతి ప్రజలను

(తరువ 11వ పేజీలో)



# గ్రీన్‌గ్లోరి "పోలీసు పాపుల" పని పడతాం

నెల్లూరు ప్రజలకు ద్రోహం చేసిన గ్రీన్‌గ్లోరి సంస్థ కార్యకలాపాల్లో భాగమున్న పోలీసు అధికారులపై చర్యలు తప్పవని ఇళ్లమంత్రి ఆదాల ప్రభాకరరెడ్డి చెప్పారు. 11తేది సోమశిల అతిథి గృహంలో విలేఖరులతో మాట్లాడుతూ ఈ వ్యవహారమై పత్రికల్లో వచ్చిన వార్తలు చదివి హోం మంత్రికి చెప్పాను. పంచాయతీలు చేస్తున్న ఒక సిఐతో పాటు, వివిధ కేసుల వ్యవహారంలో దారితప్పిన పోలీస్ అధికారుల తీరుపై దర్యాప్తు చేయిస్తానని హోం మంత్రి హామీ ఇచ్చారు. నాలుగు రోజు లాగండి; అందరిపై తగిన చర్యలు తీసు కొంటామన్నారాయన. వరద పనులు చేపట్టేందుకు 4 కోట్ల రూపాయలు మంజూరయ్యాయి. వీటిలో 3కోట్ల 30 లక్షలతో ఇంతకు ముందు పనులు మొదలయ్యాయి. 70లక్షలతో మిగిలిన పనులు కూడా మొదలు పెడతానన్నా రాయన. ఆత్మకూరు బ్రిడ్జి వద్ద నిర్మింప తలపెట్టిన షైఓవర్ పనులు ఈ యేడాం"లోనే

### ఆదాల హెచ్చరిక

మొదలవుతాయన్నారు. నెల్లూరులో రాజ మంద్రి తరహాలో మోడల్ టౌన్‌షిప్ ఏర్పాటుకు రంగం సిద్ధమయ్యింది. ఇరుగాళమ్మ దేవాలయం వద్ద వుండే 16వేల ఎకరాల్లో 3వేల మందికి పనికొచ్చేలా గృహ నిర్మాణశాఖ, హడ్కో సహాయంతో అపార్ట్ మెంట్స్ కట్టిస్తుం దన్నారు. ఒక్కొక్క అపార్ట్‌మెంట్ నిర్మాణానికి 60వేల నుంచి 70 వేల వరకు ఖర్చవు తుందన్నారు. జిల్లాలో భర్తీ చేయాల్సిన పార్టీ పదవుల విషయంలో పోటీయే లేదన్నారు. కావలి, ఆత్మకూరు, నెల్లూరు మార్కెటింగ్ పదవులకు ఒక్కొక్క పదవికి ఒక్కొక్కరే దరఖాస్తు చేశారని, జిల్లా అడహక్ కమిటీ సభ్యుల పదవులకు కూడా తాను ఎవర్నీ ప్రతిపాదించడం లేదన్నారు. నెల్లూరు పార్టీ ఇన్‌ఛార్జ్ పదవిని తాను స్వీకరించబోవని ఒక ప్రశ్నకు జవాబుగా చెప్పారు. వచ్చేనెల 5తేది నుంచి 21తేది వరకు పార్టీ సభ్యత్వ కార్యక్రమం జరుగుతుందన్నారు. హౌసింగ్ శాఖను ఆదర్శ శాఖగా మార్చను ఒక ప్రణాళిక రూపొందిస్తున్నట్లు చెప్పారు.

# డిఎస్పీ దొరగారికి లంచాల ఆకలి

## గూడూరు డివిజన్‌లో దండకాల్లో ఎస్.ఐ.లు

గూడూరు డిఎస్పీగా ఎస్.జె. ఇమ్మాన్ పదవి బాధ్యతలు తీసుకొంది మొదలు డివిజన్‌లోని అన్ని స్టేషన్లలో దండకం ఎక్కువయ్యింది. డిఎస్పీ గొంతెమ్మ కోరికలు కోరుతుండడంతో ప్రజలపై పడి వసూలు చేయక తప్పడం లేదని ఎస్‌ఐలు బాహాటంగా చెబుతున్నారు. డివిజన్‌లోని స్టేషన్లలో డిఎస్పీకి ఎక్కువ మొత్తంలో మామూలు సమర్పించే స్టేషన్ తడ. ఇక్కడి ఎస్‌ఐ నెలసరి 75వేలు సమర్పించడంతోపాటు 5 బస్తాల మసూరి రకం బియ్యం డిఎస్పీ ఇంటికి పంపాలి. తరువాతి స్థానం నాయుడుపేట స్టేషన్‌ది. 50వేలు ఇక్కడ ఎస్‌ఐ డిఎస్పీగారికి సమర్పించాలి. గూడూరుటౌన్ ఎస్‌ఐలు డిఎస్పీ ఏది కావాలంటే అది తీసుకెళ్లి ఇవ్వాలి. తలపాగరు అధికారిగా పేరుపొందిన సిఐ కంపా ప్రసాద్ కూడా డిఎస్పీ గారికి విలువైన ఫర్నీచర్ సమర్పించినట్లు తెలిసింది. డివిజన్ పరిధిలో ఎక్కడ యాక్సిడెంట్ జరిగినా వెయ్యి రూపాయలు డిఎస్పీ మామూలు ఇవ్వాల్సిందేనట. శవాలపై చిల్లర ఏరుకోవడం అనే దానికి ఇంతకన్నా ఉదాహరణ ఏదీ అక్కరలేదను కొంటాం. డిఎస్పీ గారి అభిమాని ఒకరు హైదరాబాద్‌లో చీరల వ్యాపారం చేస్తుండట. ఈయనకు ప్రతి 15 రోజులకొకసారి హోల్‌సేల్ రేట్లకు చీరలు

తరువాయి 12 పేజీలో

# ఐఎఎస్‌నని అందినంత దోచాడు

సస్పెండ్ అయిన ఐఎఎస్ అధికారి [illegible] రావు, దర్పం ప్రదర్శించి జిల్లాలోని పలువురు రెవిన్యూ ఉద్యోగులతోపాటు, ఒక సబ్ రిజిస్ట్రార్ అధికారిని మోసగించి డబ్బులు దండుకొని వెళ్లారు. రాష్ట్ర ఆర్థిక శాఖలో సహాకార్యదర్శిగా పనిచేస్తుండిన ఎవి.రావు అనే ఐఎఎస్ అధికారిని ప్రభుత్వం పలు ఆరోపణలపై సస్పెండ్ చేసింది. సస్పెండ్ అయిన అధికారికి నెల్లూరు జిల్లాలో భూములు కొనాలన్న ఉబలాటంతో ఇటీవల కలెక్టరేట్‌కు వచ్చి క్యాంపు క్లర్క్‌ను కలిశారు. తాను సీనియర్ ఐఎఎస్ అధికారి కావడం వల్ల తనకు

## జిల్లావార్తలు

సహకారం రెవిన్యూ ఉద్యోగులు సహకరించేలా చూడమని ఆయన్ను కోరారు. అధికారి దాటికి బెదిరిపోయిన సిసి ఆయన భూములు కొనాలనుకున్న కావలి ప్రాంత ఆర్డీఓకు ఫోన్ చేసి చెప్పారు. కలెక్టరేట్ నుంచి ఫోన్ వచ్చిందే తడవుగా కావలి ఆర్డీఓ ఈ అధికారికి రోడ్లు, భవనాల శాఖ గెస్ట్‌హౌస్‌లో బస ఏర్పాటు చేశారు. సకల సదుపాయాలతో ఈ అధికారిని ఖుషీ చేసి, ఆయన విహారానికి ఒక ఐడి టాక్సీ ఏర్పాటు చేశారు. అక్కడ నుంచి దుత్తలూరు వెళ్లిన అధికారి అక్కడి అతిథి గృహంలో బసచేసి రెవిన్యూ ఇన్స్‌పెక్టర్ జేబు చిల్లుపడేలా చేసి, మర్రిపాడు వెళ్లారు. అక్కడి రెవిన్యూ ఉద్యోగులతో కలసి 50 ఎకరాల భూమి కొనుగోలుకు ఒప్పందాలు చేసుకొన్నారు. చివరి మజిలీగా ఉదయగిరి గెస్ట్‌హౌస్ చేరి అక్కడి ఆర్‌ఐతో తాను ఖర్చులకు తెచ్చుకున్న డబ్బు అయిపోయిందని చెప్పి పదివేలు సర్దమన్నారు. ఆయన వేతులెత్తేయడంతో సబ్ రిజిస్ట్రార్ అధికారి విశ్వేశ్వరరావును పిలిపించి ఏ మాయ చేశాలో ఆయన 10 వేలు తెచ్చిచ్చారు. ఆ పదివేలకు ఒక చెక్కు వ్రాసిచ్చి హైదరాబాద్ వెళ్లి పోయారు. ఇచ్చిన చెక్కు చెల్లక తిరిగి రావడంతో ఆ అధికారి లబోదిబో మంటున్నారు. మర్రిపాడులో కొందరు అధికారులను కూడా ఈ అధికారి డబ్బు అడిగినా ససేమిరా కాదన్నారట. మొత్తానికి కలెక్టర్ సిసి చేసిన ఫోను పుణ్యమా అని కావలి ఆర్డీఓ, దుత్తలూరు, మర్రిపాడు, ఉదయగిరి రెవిన్యూ ఇన్స్‌పెక్టర్లు, ఉదయగిరి సబ్‌రిజిస్ట్రార్ అధికారి డబ్బులు పోగొట్టుకోవాల్సి వచ్చింది. కలెక్టరేట్‌లో డిపెక్టివ్‌ల తరహా ఉద్యోగులు లేకపోతే లేనిపోని కష్టాలొస్తాయనేదానికి ఈ సంఘటనే చక్కని ఉదాహరణ.



ప్రజా దర్బార్‌లో ప్రజల సమస్యలు వింటున్న జిల్లా కలెక్టర్ ప్రవీణ్ కుమార్ ఇతర అధికార్లు

# అవినీతికి చిరునామా-కోవూరు మార్కెట్ కమిటీ

కోవూరు మార్కెటింగ్ కమిటీ అవినీతిలో సరికొత్త రికార్డులు నెలకొల్పుతుంది. తన ఇష్టులు, తనకు లాభం వచ్చే ఏ పనినైనా మార్కెటింగ్ కమిటీ అధ్యక్షుడు గ్రీన్ సిగ్నల్ ఇచ్చేస్తున్నాడు. ఇటీవల సంగం వద్ద మార్కెటింగ్ కమిటీ కట్టిన చెక్‌పోస్టు పనులను అత్యంత నాసిరకంగా పూర్తి చేశారు. కొండరాళ్లతో గోడలు కట్టి పెద్దకు అనంతసాగరం మార్కెటింగ్ యార్డులో తుఫానుకు ఎగిరిపడిన రేకులను తెచ్చికప్పారు. కొత్త రేకులను వాడినట్లు మార్కెటింగ్ ఇంజనీరింగ్ అధికారులు ధృవీకరించడంతో 40వేలు డ్రా చేసుకొన్నారు. ఈ రేకులు పగిలిపోయి ఉరుస్తున్న స్థితిలో వున్నా వీటికి కొత్తరేకులని సర్టిఫికేట్‌ను అధికారులు ఎలా ఇచ్చారో అర్థం కావడం లేదు. మార్కెటింగ్ కమిటీ అధ్యక్షుడు బాకీల వసూలుకు కారులో వెళ్లను 9వేల రూపాయలు ట్రావెలింగ్ అలవెన్స్ ఇస్తారు. కోవూరు మార్కెటింగ్ అధ్యక్షుడు తన స్వంత కారులో స్వంత పనులు చూసుకొంటూ, 12 నెలలకుగాను లక్షా 8వేల రూపాయలు ఈ పద్దులో డ్రా చేసుకొన్నారు. మార్కెట్ కమిటీ తరఫున 55 లక్షలతో రాజుపాళెంలో కడుతున్న గోడౌన్లు, అల్లూరులో కడుతున్న 4 లక్షల రూపాయలతో నిర్మిస్తున్న ప్రహరీగోడ, అధ్వాన్నంగా కట్టిన సంగం చెక్‌పోస్టు పనులను అధ్యక్షుడు, మిత్రుడైన హజరత్ రెడ్డి అనే కాంట్రాక్టర్‌కి ధారాదత్తం చేశారు. మార్కెటింగ్ కమిటీ నేతృత్వంలో ఇటీవల జరిగిన 35 లక్షల రూపాయల గ్రామీణ రోడ్ల పనుల్లోనూ భారీ అవినీతి చోటు

## యథేచ్ఛగా నిధుల మేత

చేసుకొన్నట్లు ఆరోపణలు వస్తున్నాయి. ఈ వ్యవహారాలపై మార్కెటింగ్ శాఖ ఉన్నతాధికారులు దర్యాప్తు చేస్తే బాగుంటుంది.

## మార్కెట్ కమిటీఅవినీతి కిరికిరి

ఆత్మకూరు మార్కెటింగ్ కమిటీ కార్యాలయంలో అవినీతి తాండవ మాడుతుంది. పాలకవర్గం, ఉద్యోగులు రకరకాలుగా మార్కెటింగ్ శాఖకు చెందిన డబ్బును గాదె క్రింది పందికొక్కుల్లా తినేస్తున్నారు. మార్కెటింగ్ శాఖ ప్రతి మూడు నెలలకొకసారి రైతు సదస్సులు నిర్వహిస్తుంది. ఈ రైతు సదస్సులకు 20 మందికి మించి రైతులు రాకపోయినా, వందల మంది వచ్చినట్లు వీరికి భోజనవసతి, విశ్రాంతికి లాడ్జీలు బుక్ చేసినట్లు లెక్కలు వ్రాసి గత కొన్నేళ్లుగా లక్షలాది రూపాయలు దోచేశారు. గోదాన్లకు వాచ్‌మెన్ పేరిట కొండవీటి చాంతాడంత లిస్ట్ తయారుచేసి వారి జీతాలకు నెలకు ఒక్కొక్కరికి 1200 రూపాయలు లెక్కన పెద్ద మొత్తంలో స్వాహా చేసినట్లు తెలిసింది. మార్కెటింగ్ శాఖ చెక్‌పోస్టు కార్యాలయంలో డూప్లికేట్ రశీదులిస్తూ అక్కడ కట్టే మొత్తాలు ట్రెజరీకి జమకాకుండా తమ జేబుల్లో ఉద్యోగులు వేసుకొంటున్నారు. కార్యాలయంలో ఏ ఒక్క రికార్డు కూడా సరిగ్గా నిర్వహించడం లేదు. కార్యాలయాన్ని ఇంతగా గబ్బు పట్టించి పూర్వాధ్యక్షుడే మళ్లీ ఈ పదవి కోరుకోవడం విమర్శలకు దారి తీస్తుంది. ఆత్మకూరు మార్కెటింగ్ కమిటీ కార్యాలయంలోని అవినీతిపై ఉన్నతాధికారులు దర్యాప్తు చేయించాల్సి వుంది.

## ఎ.ఎస్.పేట దర్గా అభివృద్ధికి నోచుకోదా?

కష్టాలు, కోరిన కోర్కెలు తీర్చే మహిమాన్వితునిగా విఖ్యాతి చెందిన

(తరువాయి 8 పేజీలో)

# నెల్లూరు ముచ్చట్లు

## ప్రధాన న్యాయమూర్తిగా పొణకా వెంకట్రామరెడ్డి

అల్లూరువాసి, ప్రస్తుత రాష్ట్ర హైకోర్టు సీనియర్ న్యాయమూర్తి పొణకా వెంకట్రామిరెడ్డి, కర్నాటక హైకోర్టు ప్రధాన న్యాయమూర్తిగా నియమితులయ్యారు.

వెంకట్రామిరెడ్డి, జస్టిస్ పార్టీ నాయకుడు, మాజీ జిల్లాబోర్డు అధ్యక్షుడు స్వర్గీయ పొణకా గోవిందరెడ్డి ఏకైక కుమారుడు. స్వర్గీయ కుకటి కోదండ రామరెడ్డి అల్లుడు. భూస్వామ్య కుటుంబం నుంచి వచ్చినా, ఆ ఫ్యూడల్ భావాలు కలికానికి కూడా కన్పించవు ఆయనలో. అందరితో, అన్ని వర్గాల ప్రజలతో కలిసి పోగల సహృదయుడు. ప్రతిభావంతుడైన న్యాయవాదిగా పేరు ప్రఖ్యాతులు పొందడమే కాదు - వృత్తి నిబద్ధత కలిగిన వ్యక్తిగానూ గణుతికెక్కారు. న్యాయమూర్తిగా ఆయన విధి నిర్వహణ, నిప్పు వంటి నిజాయితీకి అద్దం పట్టింది. వివాదాలకు దూరంగా వుంటూనే ఎన్నో నిర్మొగమాటపు తీర్పులు వెలువరించారు.

అల్లూరు అంటే ఆయనకు ప్రత్యేక అభిమానం; స్వంత డబ్బుతో పబ్లిసిటీ కోరకుండా ఎన్నో మంచి పనులు చేశాడాయన.

వెంకట్రామ రెడ్డిగారికి మా హృదయ పూర్వక శుభాకాంక్షలు.

## కొత్త ఎస్పీ

జిల్లా పోలీసు సూపరింటెండెంటుగా కె. శ్రీనివాసరెడ్డి 12 తేది బాధ్యతలు స్వీకరించారు. రంగారెడ్డి జిల్లా కొండాపూర్ వద్ద గల ఏపిఎస్పి ఎనిమిదో బెటాలియన్ కమాండెంట్‌గా పనిచేస్తూ ఇక్కడికి వచ్చారు. 1994 ఐపిఎస్ బ్యాచ్‌కు చెందిన శ్రీనివాసరెడ్డి గతంలో బోధన్, కామారెడ్డి, నిజామాబాద్‌లలో ఏఎస్పిగా, మెదక్ ఓ.ఎస్.డి.గా పనిచేశారు. ఎస్.పి.గా తొలి పోస్టింగ్ నెల్లూరే. దారి తప్పిపోయి వున్న నెల్లూరు పోలీస్ శాఖను సక్రమ దారిన నడిపేందుకు శక్తివంచన లేకుండా కృషి చేస్తానంటున్నారాయన.

కె. శ్రీనివాస రెడ్డి నక్సల్ హిట్ లిస్ట్‌లో వున్న ఐపిఎస్ అధికారుల్లో 13వ వ్యక్తి. దీనిని దృష్టిలో పెట్టుకొని ఆయనకు ప్రభుత్వం బుల్లెట్ ప్రూఫ్ కారుతో పాటు, ప్రత్యేక సెక్యూరిటీ ఇచ్చింది. 12 తేది ఎస్పీ నిర్వహించిన విలేకరుల సమావేశానికి ముందు పోలీసులు ఎప్పుడూ లేని విధంగా విలేకరులను సోదాచేసి ఛాంబర్‌లోనికి అనుమతించారు. సెక్యూరిటీ మూలన సామాన్యులు ఎస్పీని కలవడం కష్టమయ్యేటట్లుంది. ఈ సమస్యను ఎస్పీ ఏ విధంగా అధిగమిస్తారో వేచి చూడాలి.

## విద్యుత్ కోత

టౌన్‌లో అప్రకటిత విద్యుత్ కోత గత వారం రోజులుగా అమలౌతున్నది. కోత సమయాన్ని అధికారులు ముందుగా ప్రకటించ కుండా ఎప్పుడంటే అప్పుడు విద్యుత్ కోతను విధిస్తున్నారు.

## మోటార్లు మళ్లీ మొరాయించాయి

నెల్లూరు వాటర్ వర్క్స్ సెక్షన్ లోని మోటార్లు వారానికోసారైనా చెడిపోతుంటాయి. గత నాలుగైదు రోజులుగా మోటార్లు మొరాయించడంతో టౌన్‌లో పలుప్రాంతాల ప్రజలు మంచినీటికై అల్లాడుతున్నారు. మోటార్లు తరచూ ఎందుకు చెడిపోతున్నాయన్న విషయమై మునిసిపల్ కమీషనరు ఒక వివరణ ఇస్తే బాగుంటుంది.

## పార్టీ పదవుల పందారం

తెలుగు దేశం పార్టీలో పదవుల పందారం రెండు, మూడు రోజుల్లోగా జరుగుతుందట. కోవూరు, ఆత్మకూరు, నెల్లూరు మార్కెటింగ్ ఛైర్మన్ల పదవుల కోసం ఒక్కొక్కరే దరఖాస్తులను పార్టీ పరిశీలకుడికి సమర్పించినట్లు ఇళ్లమంత్రి ఆదాల ప్రభాకర్ రెడ్డి చెప్పారు. జిల్లా అడహాక్ కమిటీలో నియోజక వర్గానికి ఒక్కరు చొప్పున సభ్యులుగా వుంటారట. నెల్లూరులో మాత్రం నలుగురిని ఎంపిక చేస్తారట. కొత్త సభ్యుల ఎంపికలో మార్పు, చేర్పులపై ఇళ్లమంత్రి ముఖ్యమంత్రితో 11 తేది ప్రత్యేకంగా సమావేశమవ్వాల్సింది. అది వాయిదా పడింది.

## రామలింగాపురంలో హత్య

నెల్లూరు రామలింగాపురం సెంటర్‌లో శ్రీ వైన్స్ అనే బ్రాందీ షాపువారు నడిపే అనధికార బార్‌లో ఊటుకూరు శ్రీనివాసులు (32) అనే వ్యక్తిని 11 తేది హత్య చేసారు. శ్రీనివాసులు గతంలో ట్రెజరీలో ఉద్యోగి. హరనాథపురంలోని రౌడీ గ్యాంగుల్లో తిరుగుతూ రౌడీషీటర్‌గా మారిపోయాడు. ఇటీవల ఎన్టీఆర్ నగర్‌కు చెందిన సుబ్బయ్య అనే వ్యక్తిని శ్రీనివాసులు కొట్టాడు. దీనికి ప్రతీకారంగా సుబ్బయ్య ఏర్పాటు చేసిన మనుషులు అదును చూసుకొని బార్‌లో మద్యం సేవిస్తుండిన శ్రీనివాసులును రాడ్లతో తలపగుల గొట్టి, బ్రాందీ సీసాలతో వళ్లంతా పొడిచారు.

ఈ హత్య జరిగాక శ్రీనివాసులు అనుచరులు హరనాథపురం సెంటర్‌లోని ఒక స్వీట్‌స్టాల్‌ను ధ్వంసం చేశారు. కర్రలు, కటార్లతో స్వైరవిహారం చేస్తూ ఈ ప్రాంతంలోని అంగళ్లను మూయించారు. ఈ సమయంలో పోలీసులు ప్రేక్షక పాత్ర వహించడం దారుణం. ఎస్పీగా బాధ్యతలు తీసుకొన్న కె. శ్రీనివాస రెడ్డి హత్యా స్థలాన్ని సందర్శించారు. అనధికారికంగా బార్‌ను నడుపుతున్నందుకు బ్రాందీ షాపు యజమానిపై కూడా కేసు నమోదు చేయమని ఆదేశించారు. టౌన్‌లోని బ్రాందీషాపులో నడిపిస్తున్న అనధికార బార్లను ఎస్పీ మూయిస్తే శాంతి భద్రతలు నెలకొంటాయి.

## సాయిబాబా మహాసమాధి మహోత్సవాలు

గాంధీనగర్‌లో గల షిర్డీ సాయి బాబా మందిరంలో సాయిబాబా 82వ మహాసమాధి మహోత్సవాలు 7 తేది నుంచి 10 తేది వరకు ఘనంగా జరిగాయి. పాలకవర్గం ప్రత్యేక శ్రద్ధ తీసుకోవడం వల్ల బాబాను భక్తులు తృప్తిగా చూడ గలిగారు.

## ట్రాఫిక్ సి.ఐ.

నెల్లూరు టౌన్ ట్రాఫిక్ పోలీస్ స్టేషన్ రిజర్వు ఇన్స్పెక్టరుగా సుశీల్ రావు నియమితులయ్యారు. గతంలో ఈయన పోలీస్ ఆఫీసులో రిజర్వు ఇన్స్పెక్టరుగా పనిచేసేవారు.

## కాంగ్రెస్ నిరసన

నిత్యావసర వస్తువుల ధరల పెంపుదలను వ్యతిరేకిస్తూ కాంగ్రెస్ పార్టీ నేతృత్వంలో నెల్లూరు టౌన్‌లో 17 తేది నిరసన కార్యక్రమం చేపడుతున్నారు. ఆ రోజు ఆర్టీసీ బస్టాండ్ నుంచి పార్టీ కార్యకర్తలు ఊరేగింపుగా బయలుదేరి కలెక్టరేట్ వెళ్లి ఆయనకు మెమోరాండం సమర్పించి వస్తారని ఎమ్మెల్యే వివేకానందరెడ్డి చెప్పారు.


సౌత్‌జోన్ ఇంటర్ యూనివర్సిటీ ఫుట్‌బాల్, ఖోఖో పోటీల్లో పాల్గొనే ఎస్.వి. యూనివర్సిటీ జట్టుకు ఎంపికైన వి.ఆర్. కళాశాల విద్యార్థులు షఫీ, కిరణ్‌కిషోర్, బాలక్రిష్ణ, హరి, భాస్కర్‌రావు.

## జయప్రకాష్ నారాయణ్ జయంతి సభ

జయప్రకాష్ నారాయణ్ జయంతి సభ 11 తేది టౌన్‌హాల్‌లో ఘనంగా జరిగింది. హైకోర్ట్ జడ్జి జి. సుదర్శన రెడ్డి, ఇళ్లమంత్రి ఆదాల ప్రభాకర రెడ్డి, అసెంబ్లీ మాజీ స్పీకర్ ఆర్డిఆర్. జివిఎస్ రావు సభలో పాల్గొని మాట్లాడారు. జె.పి. శతజయంతి ఉత్సవాన్ని వచ్చే యేడు జయప్రదంగా జరిపి ఈ కార్యక్రమానికి ఆపివేస్తానంటున్నాడు ఈ మధ్య పుట్టపర్తిలో స్థిరపడిన సభా నిర్వాహకుడు తుంగా పాండురంగారెడ్డి.

## జర్నలిస్టులు, రెవిన్యూ ఉద్యోగుల మధ్య పోటీ

జర్నలిస్టులు, రెవిన్యూ ఉద్యోగుల మధ్య సుహృద్భావ వాతావరణం నెలకొలిపేందుకు ఇరువురికీ కలిపి సాంస్కృతిక పోటీలు నిర్వహిస్తున్నారు. పోటీలు నవంబర్ 12 తేదీ కస్తూరిబా కళాక్షేత్రంలో జరుగుతాయి. జానపద, సినిమా పాటలు, పౌరాణిక పద్యాలు, విచిత్ర వేషధారణ, ఏకపాత్రాభినయ పోటీలతో పాటు అంత్యాక్షరి, సాహిత్య, సాంస్కృతిక అంశాలపై క్విజ్ పోటీలు పెడతారు. పోటీల్లో పాల్గొనదలచిన జర్నలిస్టులు, రెవిన్యూ ఉద్యోగులు తమ ఎంట్రీలను జిల్లా పౌరసంబంధాల శాఖాధికారికి ఈనెల 30 తేదీ లోగా పంపాలి.

## మానసిక ఆరోగ్యదినోత్సవం

అక్టోబర్ 10 తేది మానసిక ఆరోగ్య దినోత్సవాన్ని పురస్కరించుకొని నెల్లూరులోని శ్రీ సాయిసత్య హాస్పిటల్ ఆవరణలో పోస్టర్స్ ఎగ్జిబిషన్ నిర్వహించారు. ఇక్కడ ఏర్పాటు చేసిన పోస్టర్లు మానసిక వ్యాధులపై మంచి అవగాహన కల్పించాయి. నెల్లూరులో ఇటువంటి కొత్త కార్యక్రమానికి శ్రీకారం చుట్టిన డాక్టర్ సత్యనారాయణ అభినందనీయుడు.

## గోపాలరావు కథ

జమీన్‌రైతు చిత్రసమీక్షకుడు గ్రిద్దలూరు గోపాలరావు రచించిన "ప్రేమజ్యోతి" కథను ఈనెల 19 తేది ఆకాశవాణి విజయవాడ కేంద్రం ప్రసారం చేస్తుంది. కార్మికుల కార్యక్రమంలో మధ్యాహ్నం 12.40 నిముషాలకు ప్రసారమయ్యే కథను విని అభిప్రాయం తెలుపమంటున్నాడు గోపాలరావు.

## పదవీ విరమణ

కోవూరు కోఆపరేటివ్ బ్రాంచ్ మేనేజరుగా పనిచేసిన అవనిగడ్డ వెంకటకృష్ణన్ సెప్టెంబర్ 30 తేది రిటైర్ అయ్యారు.



తన 32 ఏళ్ల సర్వీస్‌లో కృష్ణన్, సూపర్‌వైజర్, అసిస్టెంట్ మేనేజర్, మేనేజర్ పోస్టుల్లో జిల్లా రైతాంగానికి ఎనలేని సేవ చేసారు.

## అనాధపిల్లల ఆశ్రమంలో చేరికకు దరఖాస్తులు

నెల్లూరు వెంగళరావు నగర్‌లోని స్నేహప్రియ ఆర్ఫన్ చిల్డ్రన్స్ హోమ్‌లో అనాధ పిల్లలను చేర్చుకొనేందుకు దరఖాస్తులు ఆహ్వానిస్తున్నారు. ఇతర వివరాలను కార్యదర్శి, పెడ్స్, 25/2030, వెంగళరావునగర్, చిరునామాకు

తరువాయి 7వ పేజీలో

# ప్రాణప్రదం

మొదటి పేజీ తరువాయి

(వ్రాసి తెలుసుకోవచ్చు.

పై కుటుంబాల వారికి మా సానుభూతి.

## నవోదయ పాఠశాల ప్రవేశపరీక్ష

ఉదయగిరి మండలం కృష్ణాపురం గ్రామంలోగల జవహర్ నవోదయ విద్యాలయంలో 2000 - 2001సంవత్సరం ఆరవ తరగతిలో ప్రవేశానికి పరీక్ష నిర్వహిస్తున్నారు. ఈ పరీక్ష 2001 సంవత్సరం ఫిబ్రవరి 11తేదీ జరుగుతుంది. దరఖాస్తు ఫారాలు డి.ఇ.ఓ., మండల విద్యాశాఖాధికారుల వద్ద, నవోదయ పాఠశాలల్లో దొరుకుతాయి. పూర్తి చేసిన దరఖాస్తులను నవంబర్ 10తేది వరకు స్వీకరిస్తారు. ఈ విద్యాలయంలో ప్రవేశానికి ఎంపికైన విద్యార్థులకు ప్రభుత్వం అన్ని వసతులు ఉచితంగా కల్పిస్తుంది. ప్రస్తుతం ఐదవ తరగతి చదివే విద్యార్థినీ, విద్యార్థుల తల్లితండ్రులు ఈ అవకాశాన్ని వినియోగించు కోమంటున్నారు విద్యాలయం ప్రిన్సిపాల్ పాల్ సత్యకుమార్.

## ఔషధ మొక్కలపై వర్క్‌షాపు

డిడిత్రైన్ (ఇండియా) స్వచ్ఛంద సంస్థ అక్టోబర్ 21తేది నెల్లూరు టౌన్‌హాల్‌లో ఔషధ - సుగంధ మొక్కల పెంపకంపై వర్క్‌షాపును నిర్వహిస్తుంది. సదస్సులో వృక్షశాస్త్రవేత్తలు, ఎ.ఎ.ఫరూఖీ కె. ప్రసాదరావు, ఎం.గోపాలరావు, జి.రాఘవరెడ్డి, వేదవతి, నాగిరెడ్డి, వసుంధర, పారిశ్రామికవేత్తలు ఎల్.కె.దాస్, నరసింహారెడ్డి పాల్గొంటారని నిర్వాహకులు తెలిపారు. సదస్సుకు హాజరవ్వాలనుకొనే రైతులు 318837 ఫోనులో సంప్రదించి, తమ పేర్లు నమోదు చేసుకోమని నిర్వాహకులు కోరుతున్నారు.

## కసాయి తల్లితండ్రులు

పెళ్లి చేసుకొన్నది మొదలుకొని తనను, తన భార్యను వేధిస్తుండిన తల్లితండ్రులను తట్టుకోలేక బాలాజీనగర్‌కు చెందిన కృష్ణ అనే యువకుడు 30తేది రైలు క్రింద తలపెట్టి ప్రాణాలు తీసుకొన్నాడు. బాలాజీనగర్, 19వ అడ్డరోడ్డులో నివాసమున్న కె.శేషాచారి దంపతులు తమ కుమారుడికి రెండేళ్ల క్రితం వివాహం చేశారు. శేషాచారి భార్య, కుమార్తెలు తనను, తన భార్యను ప్రతివిషయంలో వేధించుక తినడాన్ని భరించలేని కృష్ణ ఈ పనికి పాల్పడ్డాడు. చనిపోయిన యువకుడికి 6నెలల కుమారుడున్నాడు.

## మరణాలు

కాంట్రాక్టర్, మాజీ మునిసిపల్ కౌన్సిలర్ ఉమ్మారెడ్డి వరదారెడ్డి (63), 1వ తేది ప్రమాదవశాత్తు రైలు క్రిందపడి మరణించారు. ఆయనకు ఒక కుమారుడు, కుమార్తె.

* * *

బిజెపి నాయకుడు కర్నాటి ఆంజనేయ రెడ్డి తల్లి రంగమ్మ 23 తేది సంగంలో మరణించారు.

జమీన్‌రైతు
సంవత్సర చందా రూ. 100/-
విడిప్రతి రూ. 2/-

## సణుగుడు

2వ పేజీ తరువాయి

నుంచి తిరిగి వెళ్లడానికి ప్రయత్నించండి!

* * *

జిల్లాలో పాతకాలం పెద్ద కుటుంబాల ప్రాభవం అంతరించి పోయిందని; వారి ఆనవాళ్లే లేకుండా పోతున్నదని రెండు వారాల క్రితం ఈ శీర్షికలో చేసిన వ్యాఖ్య ఆయా కుటుంబాల వారికి మనసు కష్టం కల్గించి నట్లుంది. తమ కుటుంబాలు వెలుగు కోల్పోలేదని దొడ్లవారి తరఫున శ్రీ మురళీకృష్ణారెడ్డి సుదీర్ఘ వివరణ ఇచ్చారు. మరి కొందరూ తమ అభిప్రాయాలు చెప్పారు. వీరిని చిన్నబుచ్చడం నా సంకల్పం కాదు; కేవలం యథాలాపంగా చేసిన వ్యాఖ్య మాత్రమే అది. గమనించ మనవి. *

## ఫ్యాక్షనిజం

మొదటి పేజీ తరువాయి

కాంట్రాక్టర్లు ఫ్యాక్షనిస్టులకు రౌడీ మామూలు ఇవ్వనవసరం లేదని; ఎవరైనా తప్పు అడిగితే తమకు చెప్పాలని; కాంట్రాక్టర్లకు తాము పూర్తి రక్షణ కల్పిస్తామని పోలీసు ఉన్నతాధికారులు ఘనంగా ప్రకటిస్తున్నారు. కాని గ్రామాల లోని పోలీసు స్టేషన్లు ఐజీలు, డిఐజీల అదుపులో లేవన్న సంగతి రాయలసీమ లోని ప్రతి ఒక్కరికీ తెలుసు. కానిస్టేబుల్ నుంచి డిఎస్‌పి స్థాయి వరకు పోలీసు వ్యవస్థ సమస్తం ఫ్యాక్షనిస్టుల నియంత్రణలో వుంది. వారి బదిలీలు, ప్రమోషన్లకు హైదరాబాదులో పైరవీలు చేసేది ఫ్యాక్షన్ నేతలే!

ఫ్యాక్షన్ మాఫియా గ్యాంగులను అణచాలంటే కావలసింది పోలీసులు కాదు; రాజకీయ సంకల్పం. ముఠాల బూచిని చూపి కాంట్రాక్టర్లను, ప్రజలను పీడిస్తున్న వారినందరినీ రాజకీయాల నుంచి వెలివేస్తే తప్ప ఈ సమస్య పరిష్కారం కాదు. కాని ఇటు తెలుగు దేశం, అటు కాంగ్రెస్ పార్టీలు రెండూ ఎన్నికలు వస్తే టిక్కెట్లు ఇచ్చేది వీరికే. పంచాయితీ సర్పంచ్ పదవి నుంచి ఎమ్మెల్యే వరకు కేవలం ఫ్యాక్షనిస్టులు మాత్రమే ఉభయ పార్టీలకూ అభ్యర్థులౌతున్నారు. ప్రభుత్వ వ్యవస్థలో వారికి అంత పెద్ద పీటవేసి, పోలీసు పహారాతో ఫ్యాక్షనిజం రూపు మాపుతామని ప్రభుత్వం ప్రకటించడం హాస్యాస్పదం. ప్రభుత్వము, పోలీసులు వారినేమీ చేయలేరు. *

## కాంగ్రెస్

మొదటి పేజీ తరువాయి

విమానమెక్కారు. సోనియా గాంధీ వద్ద వీరిపురూ తమతమ పలుకుబడి ప్రయోగిస్తున్నారు.

కాంగ్రెస్‌లో ఎన్నికలు కేవలం లాంఛన ప్రాయం. ఏ పార్టీ అయినా అంతే! అందులోనూ ఇప్పుడు పార్టీ అధికారంలో లేదు. రానున్న నాలుగేళ్లలో అటువంటి అవకాశం ఏదీ రాదు. పిసిసి, డిసిసి కార్యవర్గాలు ఉత్సవ విగ్రహాల వలె వుండ వలసిందే తప్ప, ఆ పదవులందుకున్న వారికి వ్యక్తిగత రాజకీయ ప్రయోజనం కల్పించ లేవు. అది తెలిసీ ఈ ఎన్నికల కోసం వర్గాల వారీగా నేతలు ముష్టి యుద్ధం ప్రారంభించడం విచారకరం.

వర్గనేతల సమస్య పిసిసి కాదు, డిసిసిలు కూడా కాదు. ఎఐసిసి వర్కింగ్ కమిటీ సభ్యత్వం కోసమే ఈ ఆరాటం. రాష్ట్రం నుంచి అధిక సంఖ్యలో తమ అనుచరులను ఎఐసిసి సభ్యులుగా నియమింప జేసుకుంటే రేపు ఢిల్లీలో అక్కరకు పనికి వస్తుందన్నది వీరి ఆశ. అందుకోసమే ఈ పిల్లిగంతులు, వెర్రికేకలు! *

# రక్తాగ్ని క్షేత్రం - కురుక్షేత్రం

భారతీయ ఇతిహాసమైన మహాభారతానికి ఓ ప్రశస్త్రమైన స్థానం వుంది. చరిత్రలో భూమికోసం దాయాదుల మధ్య క్రీ.పూ. 3150 సంవత్సరాలకు పూర్వం మహాభారత యుద్ధం జరిగింది.

పూర్వం కురుక్షేత్రం 250 చ.మైళ్ల విస్తీర్ణం కలిగి వుండేది. ఇందులోని సప్తవనాల్లో 1.కామ్యక 2. అతిధి 3.వ్యాస 4.ఫల్కి 5.సూర్య 6.మధు 7. సీత వనాల్లో మునివాసాలుండేవి. శమంతక పంచకమనే అయిదు మడుగులు కూడా ఇక్కడ సుప్రసిద్ధం. కురుక్షేత్రానికి భృగు క్షేత్రం, బ్రహ్మవేది, దధీచి క్షేత్రానికి మారు పేర్లున్నాయి.

### కురుక్షేత్రం

నేటి ఇంద్రప్రస్థానికి సమీప ప్రాంతమని చారిత్రకుల నమ్మకం. నేటి ఢిల్లీ 'పురానా ఖిల్లా' ప్రాంతానికి సమీపంలోని సువిశాల క్షేత్రం కురుక్షేత్రం.

### ఎవరి పక్షం ఎవరు?

కౌరవపక్షంలో 33 రాజ్యాలు సంపూర్ణంగానూ, 39 రాజ్యాలు పాక్షికంగానూ పాల్గొన్నాయి. ఆంధ్ర,

**వాస్తుసంగతులు**
**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**

కర్నాటక, కేరళ వంటి దక్షిణాది రాష్ట్రాలు కౌరవపక్షం వహించాయి. పాండవులవైపు ఏడు అక్షౌహిణుల సైన్యం, ద్రుపద, విరాట, సాత్యకి, సెంగధదేవ, చేకితాన, దృష్టద్యుమ్న, శిఖండి వంటి వీరుల అధిపత్యంలో యుద్ధం చేశాయి.

మొత్తం సైన్యం సంఖ్య 15,30,900. కౌరవ సైన్యంలో 11 అక్షౌహిణుల సైన్యం పాల్గొన్నది.

ద్రోణ, అశ్వత్థామ, బాహిక, కర్ణ, శల్య, శకుని, కృపాచార్య, భూరిశ్రవ, కృతవర్మ, జయద్రథ, కాంభోజ వంటి వీరు అధిపత్యంలో వీరి సైన్యాలు యుద్ధంలో పాల్గొన్నాయి. కౌరవ సైన్యం మొత్తం సంఖ్య 24,05,700.

### తటస్థంగా వున్న రాజ్యాలు

1.కరూశ 2.కోసల 3.పుండ్రక 4.దశార్ణ 5.కేకేయ 6.కిరాత 7.మగధ 8.శిరార సేన

### యాదవులు

వీరిలో భోజాలు, వృష్టి తెగలు బలోత్తరమైనవి. భోజాలలో కృతవర్మ, సత్రాజిత్తు, అక్రూర, కంసులు ప్రసిద్ధులు. వృష్టికులలో కృష్ణ, బలరామ, సాంబ, అనిరుద్ధులు పేర్కొనదగినవారు. భోజాలు కౌరవ పక్షంవహించారు. వీరి సైన్యమే 'నారాయణ' సైన్యం. 'వృష్టి తెగవారు పాండవ పక్షం వహించారు బలరాముడు, సంబుడు, అనిరుద్ధుడు తటస్థంగా వున్నారు.

### ముఖ్యస్థలాలు

### గీతోపదేశం!

కృష్ణుడు అర్జునుడికి, 'గీతోపదేశం' చేసిన ప్రాంతాన్ని 'జ్యోతిసర్' అంటారు.

### బాణగంగ!

భీష్ముడు శరతల్పగతుడైన ప్రాంతం కురుక్షేత్రలోని 'బ్రహ్మసర్'కు దాదాపు రెండున్నరమైళ్ల దూరంలోని 'బాణగంగ' ప్రాంతం.

### పద్మ వ్యూహం!

అభిమన్యుని జయించడానికి ద్రోణుడు పన్నిన 'పద్మవ్యూహాన్ని' ఏర్పాటు చేశారు. ఈ ప్రాంతం స్థానేశ్వరానికి నాలుగున్నర మైళ్ల దూరంలోని 'అమిన్' గ్రామం.

### మరికొన్ని అంశాలు!

బీహార్‌లోని కటక్ ప్రాంతం తాటకి, మారీచ, సుబాహుల విహారక్షేత్రం-

యుద్ధ సమయానికి భీష్ముడి వయస్సు 130 సంవత్సరాలు. శ్రీకృష్ణుడి వయస్సు 81 సంవత్సరాలు. అర్జునుడు కృష్ణుడి కన్నా ఆరు మాసాలు చిన్నవాడు. యుద్ధ సమయానికి పాండవుల వయస్సు కూడా 80-90 మధ్యలో వుండవచ్చు.

పాండవులు రాయబారంలో కోరిన అయిదు వూళ్లు 1.పానిప్రస్థం (సోనేపేట్) 2. తిలప్రస్థం (కుతుబ్‌మినార్‌కు పది మైళ్లు) 3.ఇంద్రప్రస్థం (ఢిల్లీలోని పురానాఖిల్లా ప్రాంతం) 4. భాగప్రస్థం (భాగ్‌పట్) 5.పాణిప్రస్థం (పానిపట్). కృష్ణుడు తన 117 సంవత్సరాల వయస్సులో మరణించిన తర్వాత (కిరాత దండయాత్రల వల్ల) బలరాముడు జలప్రవేశం చేసి మరణించాడు.

### కురుక్షేత్రం హద్దులు!

సువిశాలమైన 250 చ.మైళ్ల విస్తీర్ణంలో కూడుకున్న 'కురుక్షేత్రం'లో ఆదికాలంలో సరస్వతీనది ఉత్తర ప్రవాహినిగా వుండేది. అంచేత కుబేరస్థానం 'సుస్థిరమై' హస్తిన 'సౌభాగ్యవంతం'గా కొన్ని వందల సంవత్సరాలు మనుగడ సాగించింది. పాటియాలా పశ్చిమ సరిహద్దు అయింది. అంచేత వరుణ స్థానం 'ఉచ్చమై' హస్తిన, ఇంద్రప్రస్థ రాజ్యాలను సుభిక్షం చేశాయి. పానిపట్, జంద్ సంస్థానాలు ఉత్తమ. పశ్చిమ మధ్యస్థ భాగంలో వాయువ్యంలో ఏర్పడ్డాయి. రాజ్యాలు సుభిక్షమైనాయి. ఆ తర్వాత ఏర్పడ్డ అనేక వాస్తు అవాంతరాల వల్ల రాజ్యాల మధ్య వారసత్వకలహాలు ప్రారంభమయ్యాయి. ఇందుకు యమునా నది 'దక్షిణ ప్రవాహం' కావడం ఒక కారణం - యమస్థాన 'అస్థిరమై' కల్లోలిత దృశ్యాలు ఏర్పడ్డాయి.

అందువల్లే హస్తిన, ఇంద్రప్రస్థ రాజ్యకల్లోలాలు దక్షిణ యమునా నదీ దిశలోని గుజరాత్ (కృష్ణ జన్మభూమి), మాళవ రాజ్యాల్లో కూడా ఏర్పడ్డాయి. ఢిల్లీకి ఉత్తరంలోని 'లోయల పల్లం' ఎంత కాపాడినా ఉత్తరంలోని గిరిశిఖరాల 'ఔన్నత్యం' బలీయమై తూర్పు, ఉత్తరాల 'సంపద'ని నీచం చేశాయి. అందువల్లే హస్తిన, ద్వారక రాజ్యాలు భోగాలననుభవించినా చివరి స్థితిలో 'ధ్వంసం'గా పహరి వైభవాన్ని పోగొట్టుకున్నాయి.*



రామాయణం గ్రంథావిష్కరణ సభలో మాట్లాడుతున్న ప్రొఫెసర్ శలాక రఘునాథశర్మ ప్రక్కన రచయిత హనుమజ్జానకీ రామ శర్మ దంపతులు, బ్రహ్మనందా తీర్థ స్వామి

## అవినీతికి దివిటి

5వ పేజీ తొరవ

అనుమసముద్రం పేట ఖాజా నాయబ్ రసూల్ దర్గాలో కనీస వసతులు లేవు. ఈ దర్గా సందర్శనకు హైదరాబాద్ తోబాటు, ఇతర సుదూర ప్రాంతాల నుంచి భక్తులు తరలి వస్తారు. అయితే ఈ పుణ్యక్షేత్రానికి వెళ్లేందుకు తగినన్ని బస్సులు లేవు నెల్లూరు నుంచి అరకొరగా బస్సులు వెళ్తుంటాయి కావలి నుంచి మరీ తక్కువ బస్సులు నడుస్తాయి. మంచి రెవెన్యూ ఉండే ఈ రూటుపై ఆత్మకూరు డిపో అధికారులు కూడా ఎందుకు సవతి తల్లి ప్రేమ చూపిస్తున్నారో అర్థం కావడం లేదు. వెల్లూరు నుంచి వింజమూరు బస్సులో హసనాపురం సెంటర్‌లో దిగిన భక్తులు జీపుల్లో ఎక్కువ ఛార్జీ చెల్లించి అనుమసముద్రంపేటకు పోవాల్సి వస్తుంది. హసనాపురం నుంచి రోడ్డు అధ్వాన్నంగా వుంది. ఈ దర్గా పాలనా వ్యవహారాలు జిల్లా సబార్డినేట్ జడ్జి చూస్తారు. కాని కాసింతయైనా అభివృద్ధి కనపడడం లేదు. ఏళ్లచరిత్ర వున్న కోనేటి నీటిని శుభ్రపర్చి ప్రసంగత్వం చేయకపోవడం వల్ల ఆ నీళ్లు చెడిపోయి గబ్బు కొడుతున్నాయి. దర్గా పరిసర ప్రాంతాల్లో అశుభ్రత తాండవిస్తుంది. దర్గాకు వచ్చే భక్తులు తాగునీటికి అల్లాడుతున్నారు. దర్గా నేతృత్వంలో నడిచే వసతి గృహాలు గలీజుగా వున్నాయి. నాయబ్‌రసూల్, దొరసానమ్మ సమాధుల వద్ద ఆధునీకరణ పనులేవీ జరగడం లేదు. ఇక్కడ ముజావర్లుగా పనిచేసే వ్యక్తులకు నిలబడి 'ఫాతెహా' చదివించే ఓపిక కూడా లేదు. న్యాయ వ్యవహారాలు చూసే జడ్జి గారికి ఆధ్యాత్మిక వ్యవహారాలు చూసే తీరికలేదేమో; ఇక్కడికి రావడాన్ని ఆయన తగ్గించుకొన్నారు. ఆత్మకూరు ఎమ్మెల్యే బొల్లినేని కృష్ణయ్య ఏ.ఎస్.పేట దర్గాపై దృష్టి కేంద్రీకరిస్తే దర్గా మంచి పర్యటన కేంద్రంగా భాసిల్లుతుందన్న విషయంలో ఎటువంటి సందేహం లేదు.

## గిరిజనులపై దళిత నాయకుల దౌర్జన్యం

చిల్లకూరు మండలంలో దళిత నాయకులు కొందరు గిరిజనులపై దౌర్జన్యం చేస్తున్నారు అంకులపాటూరు గ్రామంలో గిరిజనుల పేరు మీద వున్న భూములను దళిత నాయకులు దురాక్రమించారు. వీటిని లక్షల రూపాయలకు రొయ్యల గుంటలకు లీజుకు ఇచ్చినట్లు తెలిసింది. భూములు తమకు చెందేలా చేయమని గిరిజనులు మండల కార్యాలయం చుట్టూ తిరిగి కాళ్లరిగి పోయాయి. జిల్లా కలెక్టర్ అయినా తమ విషయం పట్టించుకోవాలని కోరుతున్నారు.

## నిరాశపర్చిన అలపలేరు ఆనకట్ట

దక్కిలి మండలం అలపలేరు ఆనకట్ట కలుజు క్రింద భాగంలో సోమవారం రాత్రి రంధ్రం పడింది. దీంతో ఆనకట్టలో చేరిన నీరు పెద్ద మొత్తంలో రంధ్రం ద్వారా వృధాగా పోతుంది. ఇటీవల కురిసిన వర్షాలకు కొండల వాగుల నుంచి వచ్చిన నీటితో ఆనకట్టలో పూర్తి స్థాయిలో నీరు చేరింది. ఈ క్రమంలో కలుజుకు క్రింద భాగంలోని కాంక్రీటుకు రంధ్రం పడింది. ఇక్కడ నీటి ప్రవాహం ఉధృతి ఎక్కువగా ఉండడం వల్ల ఎలాంటి ప్రత్యామ్నాయ చర్యలు తీసుకోలేక పోతున్నారు. ఈ స్థితిలో ఆనకట్టలో ఫుల్‌ట్యాంక్ లెవల్‌లో వున్న నీటి మట్టం గణనీయంగా తగ్గనిదే రింగ్‌బండ్ నిర్మించడం అసాధ్యమని రంధ్రాన్ని పరిశీలించిన ఇంజనీర్లు చెబుతున్నారు. తాము పట్టర్లు ఎత్తివేయడంతో వెళ్లిపోతున్న నీరు చూసి రైతులు లబోదిబో మంటున్నారు.

## మెదడువాపు మాత్రల పంపిణీ

మనుబోలు యూత్ అండ్ కల్చరల్ క్లబ్ సభ్యులు 5తేది కోదండరామపురంలో గిరిజన కాలనీలో ఉచితంగా మెదడు వాపు మాత్రలను పంపిణీ చేశారు. ఈ కార్యక్రమం అయ్యాక మురికి కాల్వలను శుభ్రపర్చి ఫినాయిల్, బ్లీచింగ్ పౌడర్ చల్లారు. ఈ కార్యక్రమంలో యూత్‌క్లబ్ అధ్యక్షుడు సురేష్, కార్యదర్శి ఎ.జగదీష్‌బాబు, సభ్యులు కిరణ్‌కుమార్, అశోక్, శ్రీను, హరి, ప్రసాద్ పాల్గొన్నారు.

## మారుమూల ప్రాంతాల అభివృద్ధికి కృషి

గ్రామాలలో నివసించే పేద ప్రజల సంక్షేమానికి వివిధ అభివృద్ధి కార్యక్రమాలు అమలు చేయడానికి రాష్ట్ర ప్రభుత్వం 1600 కోట్లు ఖర్చు చేసిందని ఇళ్ల మంత్రి ఆదాల ప్రభాకరరెడ్డి చెప్పారు. 13తేది బోగోలు మండలం పాతబిట్రగుంట గ్రామంలో 3లక్షల వ్యయంతో నిర్మించిన వంటేరు చినబాబుల్ రెడ్డి మెమోరియల్ జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల భవనాన్ని ప్రారంభించి, మంత్రి ప్రసంగించారు. రాష్ట్రంలోని మారుమూల ప్రాంతాలలో కూడా రాబోయే నాలుగు సంవత్సరాల కాలంలో రోడ్లు, మంచినీటి సమస్య, స్కూలు భవనాలు, హాస్పటల్స్ నిర్మించేందుకు ప్రభుత్వం కృత నిశ్చయంతో ఉందన్నారు. చిన్న చిన్న కార్యక్రమాలకు ప్రభుత్వం మీద ఆధారపడకుండా ప్రతి ఒక్కరూ వారి గ్రామాల సమస్యలను పరిష్కరించుకోవాలని విజ్ఞప్తి చేశారు. రాష్ట్ర ప్రభుత్వం చేపట్టిన జన్మభూమి కార్యక్రమానికన్నా ముందుగా ఈ గ్రామంలో ఉన్నత పాఠశాల నిర్మాణానికి తన తండ్రి పేరున విరాళమిచ్చిన దాత వంటేరు వెంకట కృష్ణారెడ్డని ఈసందర్భంగా మంత్రి అభినందించారు. పాఠశాల ఆవరణలో ఆటస్థలాన్ని నిర్మించేందుకు 5ఎకరాల స్థలాన్ని అందజేసిన దాతలకు మంత్రి మెమెంటోలు అందజేశారు. కార్యక్రమంలో కావలి ఎమ్మెల్యే వంటేరు వేణుగోపాలరెడ్డి మాట్లాడుతూ 1989లో ప్రారంభించి పూర్తి చేసిన ఈ పాఠశాల భవన నిర్మాణం కొన్ని సాంకేతిక కారణాల వల్ల ఆలస్యంగా ప్రారంభమైందని పేర్కొన్నారు. గ్రామాలలోని ప్రతి వ్యక్తి వారి పిల్లలను చదివించాలని ఆయన సూచించారు. పాఠశాలలో చేరి పుస్తకాలు కూడా కొనలేని పరిస్థితులలో వున్న విద్యార్థినీ విద్యార్థులకు ఉచితంగా పాఠ్య పుస్తకాలు అందజేస్తానని పాఠశాల భవన నిర్మాణ దాత వంటేరు వెంకట కృష్ణారెడ్డి హామీ ఇచ్చారు. కార్యక్రమంలో ఆర్డీఓ కె.మస్తానయ్య, నెల్లూరు జిల్లా గృహ నిర్మాణ సంస్థ మేనేజర్ రవి ప్రకాష్, జిల్లా విద్యాశాఖాధికారి జయ చంద్రకుమార్, పంచాయతీరాజ్ ఇఇ వెంకట రామిరెడ్డి, ఇరిగేషన్ ఇఇ సత్య నారాయణలు పాల్గొన్నారు.

## బస్సు షెల్టర్ కట్టించండి

సైదాపురం మండలం తలుపూరు క్రాస్ రోడ్డులో బస్సు షెల్టర్ లేకపోవడం వల్ల ప్రజలు ఇబ్బందులు పడుతున్నారు. తలుపూరు గ్రామ పంచాయతీ పరిధిలోని మూడు గ్రామాల ప్రజలు బస్సుల కోసం ఈ సెంటర్‌లోనే ఎదురు చూడాలి. ఎండా, వానల్లో వేచి చూడడం కష్టంగా వుంది. ఈ ప్రాంతీయురాలైన నెల్లూరు కౌసల్య జిల్లా పరిషత్ ఛైర్మన్‌గాపనిచేసినప్పటికీ బస్ షెల్టర్ వంటి చిన్న సౌకర్యాన్ని కూడా ఆమె కల్పించలేక పోయారు.

# సంసారి వేషాలొద్దే నా పిచ్చితల్లీ!

ఒంటి నిండా చీరకట్టుకుంటే నిన్ను ఎవరు చూస్తారే నా పిచ్చి తల్లి అంటూ హీరోయిన్ దేవయాని తల్లి కూతుర్ని నసపెడుతోంది. దేవుడిచ్చిన అందాలను ప్రేక్షకులకు చూపిస్తేనే నీకు వేషాలు, నాకు డబ్బులు అని నీతులు చెబుతోంది. చీరలు కట్టుకొని వేషాలేస్తే ఎక్కువ కాలం సినిమాల్లో ఉండలేవు. పరిశ్రమలో వుండాలంటే రూల్స్ మార్చుకో, వళ్లు కనపడే బట్టలు వేసుకోమని చెబుతోంది. ఎక్స్‌పోజింగ్‌ను ఒప్పుకోమని చెవిలో జోరిగయ్యిందట. దీన్ని తట్టుకోలేని దేవయాని తన దగ్గరకు వచ్చే నిర్మాతల్ని "నాకు గ్లామర్ పాత్రలు ఇవ్వండి. ఈ ఫామిలీ పాత్రలు చేసి చేసి బోర్ కొడుతుందని వాపోతుందట. తల్లి మాట విననందుకు దేవయానికి ఎన్ని కష్టాలు వచ్చిపడ్డాయో చూడండి.

## సీనియర్ హీరోయిన్లు ఆదర్శం

తాను నిత్యం అందంగా కనపడను చాలా జాగ్రత్తలు తీసుకొంటానని హీరోయిన్ రమ్యకృష్ణ చెప్పింది. నాకు

**దేవయానికి తల్లి హితబోధ**

వాణిశ్రీ, రాధిక, పద్మిని వంటి సీనియర్ హీరోయిన్లెవరైనా తటస్థపడితే, వెంటనే వాళ్లతో మాటలు కలుపుతాను. మేకప్ మెళకువలను అడిగి తెలుసుకొంటాను. రాధిక గారైతే చేసి చూపిస్తారు. కొత్తగా బ్యూటీకేర్‌లో ఎన్ని మార్పులు వచ్చినాసరే, సీనియర్ల దగ్గర వుండే కొన్ని చిట్కాలు మాత్రం ఎప్పటికీ పనికి వచ్చేవిగానే వుంటాయి. వాటిని నేర్చుకొంటే ఎంతో ఉపయోగపడతాయి. అందుకే ఏదైనా ఫంక్షన్స్‌కు వెళ్లినప్పుడు తాను సీనియర్ల ప్రక్కన చేరిపోతానంది రమ్యకృష్ణ.

## మళ్లీ రెచ్చిపోతున్న మమతా

అసభ్యంగా పత్రికలకు ఫోజులిచ్చినందుకు ఇటీవలే కోర్టుకు క్షమాపణ చెప్పి, జరిమానా కట్టి ఈ కేసు నుంచి బయటపడ్డ మమతా కులకర్ణి మళ్లీ అదే బాటన పయనిస్తుంది. "ఖజురహో" బహుభాషా చిత్రంలో ఆమె రెచ్చిపోయి

(రాయి 11వ పేజీలో)

# అందాల విందుతోనే కాసుల పసందు

అంగాంగ ప్రదర్శనలకు ఆకాశమే హద్దుగా ఉండాలని అందాల తార అల్ఫాన్సా చెబుతోంది. నిర్మాత, దర్శకులు ఒకటి చూపించమంటే, రెండు చూపించే విధంగా ఉంటేనే పరిశ్రమలో రాణించగలమని సెలవిచ్చింది. కొత్త తారలు ఈ సూత్రం పాటించి, పరిశ్రమలో ఎదగాలన్నదే తన కోరికని చెప్పింది. సినీ పరిశ్రమలో నిలదొక్కుకొని ఎదగాలంటే ఈ నియమాలు పాటించాలంటుంది అల్ఫాన్సా. గుడ్డలు విప్పేసి సెక్సీగా ఫోజులివ్వడానికి సిగ్గుపడకూడదు. ఆ విధంగా సిగ్గుపడితే ఫీల్డ్‌లో బోణీకాదు. ఎక్స్‌పోజింగ్‌కు ఆకాశమే హద్దు అనే ఫార్ములాను పెట్టుకొంటే అన్ని భాషల్లో అవకాశాలొస్తాయి. నేను ఇదే ఫార్ములాను అనుసరించబట్టే ప్రస్తుతం హాయిగా వున్నాను. కొత్త హీరోయిన్లు నా ఫార్ములాను పాటిస్తే ఇంక తిరుగుం డదంటుంది.

**అల్ఫాన్సా చెప్పిన అక్షర సత్యాలు**

## అనూరాధ కుమార్తె హీరోయిన్ అయ్యింది

నటి అనూరాధ కుమార్తె "అభి' హీరోయిన్ అయ్యింది. శివసాయి క్రియేషన్స్ తెలుగు, తమిళ, మళయాళ భాషల్లో నిర్మించే చిత్రంలో అభి హీరోయిన్‌గా నటిస్తుంది. తెలుగులో ఈ చిత్రానికి "జల్సా చేసుకుందాంరా' అని పేరు పెట్టారు. భార్యాభర్తల మధ్య అనుబంధాన్ని ఈ చిత్రంలో గొప్పగా చూపుతున్నట్లు దర్శకుడు సరసకుమార్ చెప్పారు.

## కుష్బూకు పాపపుట్టింది

దర్శకుడు సుందర్‌ను గత ఏడాది పెళ్లి చేసుకొన్న కుష్బూ, సెప్టెంబర్ 27తేది ఒక పాపకు తల్లయ్యింది. ముంబాయికి చెందిన ఈ నటి మొదట తెలుగు చిత్రాల్లో నటించి, ఆ తర్వాత తమిళ పరిశ్రమకు వెళ్లి అక్కడ స్థిరపడిపోయింది. శివాజీగణేషన్ కుమారుడు నటుడు ప్రభుతో కొన్నేళ్లు ప్రేమాయణం వెలగబెట్టిన కుష్బూ పేరిట ఆమె అభిమానులు ఒక దేవాలయాన్ని కట్టారు. కుష్బూ పేరిట పలు హోటళ్లు, వాటిలో ప్రత్యేక ఐటమ్స్ అమ్ముడయ్యాయి. మహిళలకు సంబంధించిన ఎన్నో సౌందర్య వస్తువులు కూడా కుష్బూ పేరిట తయారయ్యి మార్కెట్‌లో నిలదొక్కుకొన్నాయి.

# సామాజిక దురన్యాయాలపై 'ఆజాద్' వార్

"ఆజాద్" అక్కినేని నాగార్జున చిత్రం. ఆయన పోషించిన పాత్ర పూర్తి పేరు చంద్రశేఖర్ ఆజాద్. భారతదేశం బానిసత్వంలో చిక్కుకొని వున్న రోజుల్లో - విప్లవవీరుడుగా, స్వాతంత్ర్య సమరయోధుడుగా చంద్రశేఖర్ ఆజాద్ బ్రిటీష్ వారి నిరంకుశ పెత్తనం మీద ధ్వజమెత్తాడు. స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత తెల్లదొరల బాధలు తప్పినా క్రమేణ మన నల్లదొరల దోపిడీ విధానాలు మితిమీరి పోయాయి. అందువల్ల ఈ తరం చంద్రశేఖర్ ఆజాద్ మనదేశంలో పెట్రేగిపోతున్న దుష్టశక్తుల మీద పోరాటం సాగిస్తాడు. ఆవేశపూరితమైన పాత్ర స్వభావానికి తగ్గట్టుగా, నాగార్జున ఇమేజ్ పట్టు ఇంకా పెరిగేట్టుగా, సన్నివేశాలను దర్శకుడు తిరుపతిస్వామి కూర్చాడు. ఆవేశానికి తోడు పాత్రకు ప్రేమ, నృత్యాలు, సెంటిమెంటు, వినోదం మేళవింపు జరిగింది. ఈ రసాలన్నిటా, నాగార్జున మెరుపులాంటి నటన ప్రదర్శించాడు. దుష్టశక్తులతో ఫైట్లు చేసేప్పుడు ఆయన రౌద్రరూపాన్ని, ఇద్దరు హీరోయిన్లతో ప్రేమగీతాలు ఆలపిస్తూ నృత్యాలు చేస్తున్నప్పుడు ఆయన స్టెప్పుల్లో వెరైటీని, చూచి తీరవలసిందే.

కథ గ్రామీణ నేపథ్యంలో, పట్టణ వాతావరణంలో సాగుతుంది. పల్లెలో పుట్టి పెరిగిన ఆజాద్ స్వతహాగా అవినీతి, అక్రమాలను ఎదిరించే స్వభావం కలిగి వుంటాడు. ఆయనకు తల్లి, చెల్లి వుంటారు. చలాకీగా వుండే మరదలు పిల్ల (శిల్పాశెట్టి) వుంటుంది. ఆమె ఆజాద్‌ను ప్రేమిస్తుంది. చెల్లెలు పెళ్లి కోసం వస్తువులు కొనేందుకు పట్టణానికొస్తాడు ఆజాద్. అక్కడ అనుకోకుండా దుష్టశక్తులను ఎదిరించటంతో అక్కడ జనమంతా అతన్ని పెద్ద

**చిత్రసమీక్ష**

* * *

**గ్రిద్దలూరు గోపాలరావు**

హీరోగా పొగిడేస్తారు. ఇక అంతే రాక్షసత్వానికి వారసులుగా నిలిచిన వారిపై ధ్వజమెత్తుతాడు.

ఆ పట్టణంలో అంజలి (సౌందర్య) అనే చురుకైన అమ్మాయి జర్నలిస్టుగా వుంటుంది. సమాజంలో అనుక్షణం దోపిడీ విధానాన్ని జ్వలింపచేస్తున్న స్వార్థ రాజకీయ అమానుషత్వంపై తన కలాన్ని ఝళిపిస్తుంటుంది. తన అభిరుచి, ఆజాద్ ఆదర్శం, సరితూకంగా వుండటంతో, అంజలి, ఆజాద్‌ను ప్రేమిస్తుంది. పరామామూలుగా అన్ని తెలుగు చిత్రాల్లో వున్నట్టే ఇందులోనూ ఒక హీరో, ఇద్దరు హీరోయిన్లు తయారవుతారు. ఆజాద్ సామాజిక సమస్యలకు తీవ్రంగా స్పందిస్తూ, అమానుషత్వం చేసే గాయాలకు చికిత్స చేస్తూ ఇద్దరు ప్రియురాళ్లతో ఆడుతూ పాడుతూ వారి హృదయాల్లో ఒదిగి పోతూ, ఒక మార్గంలో పోరాటం, మరో మార్గంలో ప్రేమ ఆట ఇలా రెండు మార్గాలను విజయవంతం చేశాడు. పోరాట మార్గంలో దుష్టశిక్షణ, శిష్టరక్షణ జరిగిపోతుంది. ప్రేమ మార్గంలో ఇద్దరి ప్రియురాళ్ల ప్రణయం పరాకాష్టను చేరుకోవటంతో ఇద్దరిని పెళ్లాడ కూడదు కాబట్టి, చివరన ఒకరి త్యాగం దాపురిస్తుంది. మరొకరికి పెళ్లియోగం ఏర్పడుతుంది.

ఆజాద్ పాత్రకు తోడుగా సలీమ్ అనే పోలీస్ అధికారి పాత్ర చిత్రానికి చేవగా నిలుస్తుంది. సలీమ్ ముస్లిం

(రాయి 11వ పేజీలో)



సకుటుంబ సపరివార సమేతంలో మహర్షి రాఘవ, సుహాసిని

# కౌసల్యకు ముదిరిన 'గాడిదభక్తి'

పాత పద్ధతులను వ్యతిరేకించే నటి కౌసల్య అనుసరిస్తున్న కొత్త పద్ధతి ఎవరికీ అర్థం కావడం లేదు. కౌసల్య మద్రాసుకు షూటింగ్‌కు వస్తే ఆదిత్య హోటల్‌లో దిగుతుంది. దీనివల్ల హోటల్ యాజమాన్యం ఒక గదిని ఆమె కోసం సదా సిద్ధం చేసి వుంటుంది. అయితే ఈ రూమ్‌లో కౌసల్య ఒక గాడిద బొమ్మను పెట్టింది. దీనికి లామినేషన్ కూడా చేయించింది. రోజూ ఉదయం లేవగానే ఆ గాడిద ముఖాన్ని చూసి దేవుడా అన్నట్లు "అప్పాడా' అంటుందట. ఆ తర్వాత ఆ గాడిదను కళ్లకు అద్దుకొంటుందట. ఈ వింత ప్రవర్తన ఏమిటని ఆత్మీయులు అడిగితే, ఇలా గాడిదను పొద్దున్నే చూసి కళ్లకు అద్దుకోవడం ఆరంభించినప్పట్నుంచి తనకు వేషాలు బాగున్నాయని చెబుతోంది. కౌసల్య మాటలు విని ఎందరు గాడిదభక్తులవుతారో?

## కోడి రామకృష్ణ కొత్త నిర్వచనం

హీరో, విలన్ల పదాలకు కొత్త నిర్వచనం చెప్పారు దర్శకుడు కోడి రామకృష్ణ. సినిమా బాగుండాలని కోరుకొనే ఎవరైనా ఆ సినిమాకు హీరో అనీ, పాడు చెయ్యాలని చూసే ప్రతివాడు విలన్ అని చెప్పారాయన. ఈ విషయాన్ని మరింత వివరంగా చెబుతూ "నానా తిప్పలూ పడి సినిమా తీసి రిలీజ్ చేస్తే అది బాగా ఆడుతున్నా పనిగట్టుకొని నెగటివ్ ప్రచారం చేసేవారు కొందరుంటారు. వీళ్లంతా ఆ సినిమా పాలిట విలన్లు. ఇండస్ట్రీ పదికాలాల పాటు పచ్చగా వుండాలని ఆశిస్తూ, సినిమా బాగుండాలని మనసారా కోరుకొంటూ, వున్నది వున్నట్లు మాట్లాడే వాళ్లందరూ తన దృష్టిలో హీరోలన్నారాయన.

## పెళ్లి చేసుకొని ప్రేమిస్తాను

బ్యాచ్‌లర్స్ చిత్రంలో హీరోయిన్ మాన్యకు పలు చిత్రాల్లో నటించే అవకాశాలొస్తున్నాయి. మాన్యకు ప్రేమ గూర్చి చెప్పమంటే; అదంటే చచ్చేంత భయమంది. ప్రేమించిన తర్వాత పెళ్లి చేసుకోలేకపోతే మనస్సాక్షిని చంపుకొని జీవితం గడపాలి. అందుకే పెళ్లైన తర్వాత ప్రేమిస్తానంటుంది. కాలేజి రోజుల్లో నన్ను చాలా మంది ప్రేమిస్తున్నట్లు వుత్తరాలు వ్రాశారు. వీటిలో రక్తంతో వ్రాసిన

**హైదరాబాదు సినిమా వార్తలు**

ఉత్తరాలు కూడా వున్నట్లు మాన్య వివరించింది.

## పాపం......... నగ్మా!

రంగు పిచ్చి పట్టుకొంటే వదలదని పెద్దలు ఎప్పుడో చెప్పారు. ఈ మధ్య వరకు ఒక వెలుగు వెలిగిన నగ్మా వేషాల కోసం మళ్లీ ప్రయత్నించి, ప్రయత్నించి విసిగి వేసారి పోయింది. తన చెల్లెలు జ్యోతికతో "నువ్విప్పుడు చాలా బిజీగా వున్నావు. పెద్ద హీరోలతో పెద్ద కంపెనీలతో చేస్తున్నావు. ఆ సినిమాల్లో నాకు ఒక్క పాత్రైనా అడుగు... అంటూ బ్రతిమాలు తుందట. జ్యోతిక, అక్క కోసం గట్టిగా ప్రయత్నించినా ఏ నిర్మాతలు ఒప్పుకోవడం లేదట. పాపం... నగ్మా!

# వారఫలాలు

*14-10-2000తేది నుండి 20-10-2000తేది వరకు వృషభంలో శని, గురువు; మిధునంలో రాహువు; సింహంలో కుజుడు; కన్యలో రవి, తదుపరి 17తేది నుండి తులలో; తులలో బుధ; వృశ్చికంలో శుక్రుడు; ధనుస్సులో కేతువు; మేష వృషభ, మిధునాలలో చంద్రుడు.*



## మేషం

(అశ్విని, భరణి, కృత్తిక 1వ పాదం)

వృత్తి, వ్యాపార రంగాలలో ఆదాయం పెరుగుతుంది. ఇతరుల భాగస్వామ్యంలో చేరతం. పెట్టుబడులు అందు కొనడం జరుగుతుంది. పనులు పూర్తి చేయడానికి ఖర్చు పెడతారు. వివాద విషయాలు, సమస్యలు పరిష్కారానికి వస్తాయి. శుభకార్యాలలో పాల్గొంటారు. శుభకార్య నిర్ణయాలుంటాయి. కొన్ని ముఖ్య నిర్ణయాలు జరుగుతాయి. రాజకీయ, సాంకేతిక రంగాల వారికి అనుకూలంగా ఉండే సమయం.



## వృషభం

(కృత్తిక. 2,3,4పాదాలు, రోహిణి, మృగశిర 1,2 పాదాలు)

వృత్తి, వ్యాపార, వ్యవసాయ రంగాలలో వారికి ఆర్థికస్థితి బాగుంటుంది. సొంత పనులు, ఉద్యోగ పనులు అనుకూలంగా ముందుకు సాగుతాయి. అధికారుల సహకారం, ఆదరణ బాగుంటుంది. ఉద్యోగ అనదపు బాధ్యతలు పైనబడగలవు. గౌరవ ప్రతిష్టలు బాగుంటాయి. ఇతరులకు ఆర్థికంగా సహాయపడతారు. బంధుమిత్రులు మీకు సహాయపడతారు.



## మిధునం

(మృగశిర. 3,4 పాదాలు, ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పాదాలు)

ఈ రాశి వారికి ఆశించినంతగా ఆదాయంగాని, ఆర్థికస్థితిగాని ఉండదు. మిత్ర, బంధువర్గాలతో విభేదాలు రావచ్చును. అనుకున్న పనులు సరిగా జరుగక చికాకుపడతారు. మానసిక టెన్షన్ ఎక్కువగా ఉంటుంది. అనవసర ఖర్చులు, వస్తు నష్టం, ప్రతిదీ సమస్యగా తోచడం జరుగుతుంది.

## కర్కాటకం

(పునర్వసు 4 పాదం, పుష్య, ఆశ్రేషలు)

ఆదాయం పెరుగుతుంది. పనులను విజయపథంలో జరుపుకుంటారు. వ్యాపార, వ్యవసాయ రంగాలలో పెట్టుబడులు పెరగడం, మంచి అవకాశాలు రావడం జరుగుతుంది. స్థిరాస్తుల నిర్మాణాలు లభిస్తాయి. విధి నిర్వహణలో గుర్తింపు, అధికారుల సహకారం బాగుంటుంది. రాజకీయ ప్రాభవం పెరుగుతుంది. కుటుంబ సౌఖ్యం, బిడ్డలకు శుభకార్యా నిర్ణయాలు జరుగగలవు. విద్యావృద్ధి బాగుంటుంది.

## సింహం

(మఖ; పుబ్బ; ఉత్తర 1వ పాదం)

వృత్తి, వ్యాపార రంగాలలో జీవనం ఉన్నవారికి ఆర్థికంగా బాగుంటుంది. కొత్త వస్తువులు కొంటారు. పనులు సత్ఫలితాన్నిస్తాయి. కార్యానుకూలత, విద్యావృద్ధి బాగుంటుంది. ఉపాధి అవకాశాలు పొందుతారు. అధికారులతో సఖ్యత, గుర్తింపు పొందుతారు. ఉద్యోగులు చక్కగా బాధ్యతలను నెరవేరుస్తారు. కుటుంబ సమస్యలు, వ్యవహారాలు పరిష్కారస్థితికి చేరుతాయి. రాజకీయం ప్రాభవం బాగుంటుంది. సాంస్కృతిక, సాంకేతిక రంగాల వారికి సంతృప్తికరంగా ఉంటుంది. స్వల్ప ప్రయాణాలు, శుభకార్యాలకు చెందిన వార్తలు, ప్రముఖులతో పరిచయాలుంటాయి.

## కన్య

(ఉత్తర 2, 3, 4 పాదాలు; హస్త; చిత్త 1,2 పాదాలు)

వ్యాపారస్థులు, వ్యవసాయదారులకు ఆదాయం సంతృప్తికరంగా ఉండి, అవకాశాలు మెరుగుపడతాయి. అనారోగ్య ఖర్చులు, ఆడంబరాల ఖర్చులు పెరుగుతాయి. అధికారుల సహకారంతో ఉద్యోగ బాధ్యతలు నిర్వర్తిస్తారు.

## పంచాంగం

### ముహూర్తాలు

14తేది శనివారం ఉదయం 7.45 గంటలకు వివాహాలకు తులా లగ్నాన సముహూర్తాలున్నవి.

### అక్టోబర్ తిథులు

ఆశ్వయుజ బహుళ

తేది 14శని పాఢ్యమి ప1.50గం.వ
తేది 15 ఆది విదియ ప1.00గం.వ
తేది 16 సోమ తదియ ప 11.45 గం.వ
తేది 17 మంగళచతుర్థి 10.00 గం.వ
తేది 18బుధ పంచమి ఉ 8.10 గం.వ పిదప పూర్తి షష్టి
తేది 19 బేస్త సప్తమి రా 3.45 గం.వ
తేది 20 శుక్ర అష్టమి రా1.00 గం.వ

స్వయంపాకుల శ్రీనివాసులు, ఎంఏ.

## తుల

(చిత్ర 3,4పాదాలు, స్వాతి, విశాఖ1, 2, 3 పాదాలు)

అన్ని వర్గాల వారికి పనులు సరిగ్గా జరుగవు. ఆర్థికస్థితి బాగుంటుంది. బంధుమిత్రులతో విభేదాలు రాకుండా జాగ్రత్తపడాలి. అధికారపరమైన సమస్యలు కలిగి తొలగగలవు. రావలసిన బాకీలు, ప్రభుత్వపరమైన ఋణాలు వాయిదా పడగలవు. ఆరోగ్యలోపం, నరాలు, కండరాల బాధ ఉంటుంది.

## వృశ్చికం

(విశాఖ 4 పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

వ్యవసాయ, పరిశ్రమల రంగాల వారికి ఆదాయం పెరుగుతుంది. వ్యాపారస్థులు ఆర్థికంగా, అధికార వర్గాల వల్ల చిక్కులుపడతారు. సొంతపనులు, ఉద్యోగపరమైన పనులు నిదానంగా జరుగుతాయి. అవసరాలకు అప్పుచేసినా ఆశ్చర్యం లేదు. విధి నిర్వహణలో ఆటంకాలు స్వల్పంగా రావచ్చును. ప్రముఖులతో పరిచయాలుంటాయి. కుటుంబ సౌఖ్యం బాగుంటుంది. ఆరోగ్యం మాత్రం సరిగా ఉండదు. విద్యాప్రగతి బాగుంటుంది.

## ధనుస్సు

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1పాదం)

ఈ రాశి వారికి ఆదాయం బాగుంటుంది. ఇతరులకు ధన, వాగ్రూపంలో సహాయం చేస్తారు. అధికారులతో సఖ్యత, ఉద్యోగ బాధ్యతలలో గుర్తింపు ఉంటుంది. శాస్త్ర, సాంకేతిక ఉపాధి అవకాశాలు పొందుతారు. కుటుంబ స్త్రీలకు ఆరోగ్యం సరిగా ఉండదు. కొత్త వ్యాపార అవకాశాలు, పెట్టుబడుల అవకాశాలు లభిస్తాయి. దైవ, శుభ కార్యాలలో పాల్గొంటారు. దూరం చేసుకొన్న బంధుమిత్రులు చేరువ కాగలరు. పనులందు అనుకూలత ఉంటుంది. విద్యాప్రగతి సామాన్యం. క్రయవిక్రయ లావాదేవీలు నిర్ణయం కాగలవు.

## మకరం

(ఉత్తరాషాఢ 2,3,4 పాదాలు, శ్రవణ, ధనిష్ఠ 1,2 పాదాలు)

ఈ రాశి వారికి ఆదాయం బాగుంటుంది. ఆర్థికాభివృద్ధికి పథకాలను ఆచరణలో పెడతారు. కుటుంబ సౌఖ్యం బాగుంటుంది. స్థిరాస్తుల వ్యవహారాలు, ఋణ వ్యవహారాలు పెండింగ్‌లో పడతాయి. శుభకార్యాలలో పాల్గొంటారు. చిన్న చిన్న గాయాలు, ఉదరకోశ, శిరస్సంబంధిత రుగ్మతలుండవచ్చును. కళా, రాజకీయ రంగాల వారికి ప్రాధాన్యం కలుగుతుంది.

## కుంభం

(ధనిష్ఠ 3,4 పాదాలు, శతభిష, పూర్వాభాద్ర 1,2,3 పాదాలు)

సొంత పనులను, ఉద్యోగ బాధ్యతలను సమర్థవంతంగా నిర్వహిస్తారు. ఆలోచనలు కార్యరూపం దాల్చుతాయి. ఆర్థిక పరిస్థితి బాగుంటుంది. వృత్తి, వ్యాపార, వ్యవసాయ, పారిశ్రామిక రంగాలలో పెరుగుదలకు అవకాశాలు వస్తాయి. శుభకార్య నిర్ణయాలు జరగడం, దూర ప్రయాణాలుంటాయి.

## మీనం

(పూర్వాభాద్ర 4 పాదం, ఉత్తరాభాద్ర, రేవతి)

వ్యవసాయ, వ్యాపార రంగాల వారికి పెట్టుబడులు, ఋణాలు అందుతాయి. ఆర్థికస్థితి సామాన్యంగా ఉంటుంది. అధికారుల సహకారం బాగుంటుంది. సాంకేతిక, శాస్త్ర రంగాల వారికి ఉద్యోగలాభం; అనుకున్న పనులను సాధించుకొనే తెలివితేటలు బాగుంటాయి. రాజకీయ పలుకుబడి పెరుగుతుంది.

# జనవాణి

3వ పేజీ కొరవ

పత్రికల్లో ప్రకటించారు. ఆయన తనకు ఏ విషయం తెలియదని ఒక సభ్యుడు చెప్పినట్లు నడుచుకొంటానని చెప్పి అందర్నీ ఆశ్చర్యపర్చాడు. గ్రామ పంచాయతీలకు కోట్ల కోట్ల నిధులొస్తున్నాయి. వాటి వినియోగానికి కనీసంగానైనా చదువుకొన్న వారు సర్పంచ్‌లు, మెంబర్లు అయితే అవి సద్వినియోగ మవుతాయి.

చెన్నై ఎన్.రాంమోహన్‌రెడ్డి

## దళిత ఎమ్మెల్యేలు మాట్లాడాలి

రాష్ట్రంలో దళితుల పరిస్థితి దయనీయంగా వుంది. ఈ పరిస్థితులపై ఇటీవల ఎందరో ఎమ్మెల్యేలు అసెంబ్లీలో మాట్లాడారు. కాని దళిత ఎమ్మెల్యే లెవరు ఈ విషయమై నోరు మెదపలేదు. ఈ విధంగా వుంటే దళితులకు న్యాయం ఎలా జరుగుతుంది.

కొడవలూరు కె.పెంచలయ్య

## సామాన్యులు పాలకులు కావాలి

సంస్కరణలంటే సామాన్యుల సంక్షేమాభివృద్ధి అని యెంచి సంబరపడి స్వాగతించారు. కాని అనుకున్నదొకటి - అయినది వేరొకటి. సంస్కరణల పేరుతో అన్నింటి ధరల్ని విపరీతంగా పెంచేశారు. ధరలు పెరగడమే అభివృద్ధా? నూతన ఆర్థిక విధానాల వల్ల మనం ఎదుగుతున్నామా? లేక అధః పాతాళానికి దిగుతున్నామా? ప్రైవేటీకరణ, ప్రపంచీకరణ పేరుతో క్రమంగా స్వదేశాన్ని విదేశాలకు ధారాదత్తం చేసే మహత్తర, బృహత్తర కార్యక్రమం నేడు కొన సాగుతుంది. పరాయి పాలనలో కష్టనష్టాలు భరించలేక నాడు స్వాతంత్రోద్యమ పోరాటం జరిపాం. తెల్లదొరల్ని తరిమేశాం. స్వరాజ్యం వచ్చినా సురాజ్యం రాలేదు. సర్వోదయం సిద్ధించలేదు. సామాన్యులకయితే నేడు బాధలు మరీ పెరిగాయి. తెల్లపిల్లి అయినా, నల్లపిల్లి అయినా తినేది ఎలుకల్నే. స్వార్థపరులు, నేర చరిత్రులు, సంపన్నులు మాత్రమే ఎన్ని కయ్యే విధంగా వున్న నేటి చట్టాల్ని సమూలంగా సంస్కరించాలి. లేకపోతే మనగతి; అధోగతే.

గూడూరు వి.వి. ప్రభాకరరావు

## వాస్తవాలు వ్రాస్తున్నారు

గ్రీన్‌గోల్డ్ సంస్థ ముసుగులో పోలీసులు చేసిన మోసాలు మొదట బయట పెట్టింది జమీన్‌రైతు. ఆ సంస్థ నిర్వాహకులు బోర్డు తిప్పాక ఈ నెల 6తేది సంచిక సణుగుడు శీర్షికలో 'డిఐజిగారు మీరే దొంగలైనప్పుడు ఇక దొంగలను మీరేంది పట్టుకునేది' అని ధైర్యంగా వ్రాయడం మీకే చెల్లింది. ప్రజలను రక్షించాల్సిన పోలీసులే భక్షకులుగా మారితే సామాన్యులకు న్యాయం ఎక్కడ దొరుకుతుంది. వాస్తవ వార్తలతో ప్రజలను చైతన్య వంతులను చేస్తున్న మీకు నా అభినందనలు.

నెల్లూరు నెల్లూరు బాబు

## లిఫ్టు ఎక్కితే 30 రూపాయాలా?

పొగతోటలోని ఒక ప్రముఖ నాలుగంతస్తుల వైద్యశాలలో ఎవరైనా రోగులను సందర్శించాలంటే లిఫ్టు సౌకర్యం వాడుకొన్నందుకు 30 రూపాయలివ్వాలి. లేదంటే ఇక్కడున్న మెట్లు ఎక్కాలంటే తలప్రాణం తోకకొస్తుంది. ముసలి ముతక, గర్భిణీలు మెట్లు ఎక్కలేక పడరానిపాట్లు పడుతున్నారు. ఎంత ప్రైవేట్ వైద్యశాల అయినా ఈ విధంగా ప్రజల సొమ్ము దోపిడీ చేయడం తగదు. అన్నివేళల్లో కాకపోయినా రోగులను సందర్శించే సమయాల్లోనైనా లిఫ్టును ఉచితంగా ఉపయోగించుకొనే అవకాశాన్ని హాస్పిటల్ నిర్వాహకులివ్వాలి.

నెల్లూరు టి.వి.నారాయణ

## 50 ఏళ్లక్రితం

3వ పేజీ కొరవ

లేకపోతే కరువు ప్రాప్తించేటట్లు వున్నది. పెన్నకు మాత్రం నీరు వచ్చినది.

### నెల్లూరు తాలూకా

పెన్నకు ఇప్పటి వరకు చెప్పుకోదగ్గ నీరు రాలేదు. నిన్న నేడు మాత్రం ఆనకట్ట మీద 2 అడుగుల నీళ్లు వచ్చినవి. పట్టర్స్ మీద పొర్లుతున్నవి. అయిదారు పట్టర్లు పడిపోయినవి. బండ్లరాకపోకలు మాత్రం ఆగిపోయినవి. మనుష్యులు కొద్దిగా నడుస్తున్నారు. తాలూకాలో చాలా భాగం డెల్టా క్రింద సాగు అయినవి. చివర భాగాలకు నీళ్లు అందక బాధపడుతున్నారు.

వెంకయ్య

### కావలి తాలూకా

పుబ్బకార్తెలో నాలుగు పదునులు వర్షం కురిసినది. తరువాత ఇంత వరకు ఏమీలేదు. గతవారం చుట్టు ప్రక్కలా అరపదును చినుకులు పడ్డవి. తాలూకాలో చెరువులకు కొద్ది కొద్దిగా నీరు వచ్చినది; వచ్చిన మటుకు అయిపోనవి. కావలి చెరువులో కొద్దిపాటి నీరున్నది. అందరికి సరిపోవని అవి కూడా వదలడం లేదు. వెలగడ పైరులు వర్షము కోసం ఎదురు చూస్తున్నవి. ఒకసారి తడసినవి మాత్రం షుమారుగా నున్నవి. వారం రోజులలో వర్షం పడనియెడల ఎక్కువ భాగం పైరులు చెడిపోవును. మెట్టపైరులు ఇంకా వేయలేదు. ఆహార ధాన్యాలు [illegible] బాధపడుచున్నారు. అప్పుటప్పుడు [illegible]. టైఫాయిడ్, మలేరియా వ్యాధులు వున్నవి.

పెండెం వెంకటేశ్వర్లు

### గూడూరు తాలూకా

కోట ప్రాంతంలో ఒకచోట కురిసిన వర్షాలు ఒకచోట లేవు. చిట్టేడు చెన్నప్పగారి పాళెంలలో మాత్రం నాలుగు దినాల నాడు రెండు పదునులు వర్షం కురిసింది. అచ్చట మెట్ట పైరులు బాగా వున్నవి. కోటకు సన్నకాలువ ధర్మమున నార్లు అయినవేకాని కలుపు తీయడం మానవ ప్రయత్నంలో సాధ్యమయ్యేటట్లు లేదు. కోటలోని జీతాల మీద ఆధారపడ్డ నౌకర్లు రిలీఫ్ షాపులకు బియ్యం సప్లయి లేనందున చాలా బాధపడుతున్నారు. ఎండు గడ్డిలేక పశువుల బాధ గూడా జాస్తిగా నున్నది.

నల్లపరెడ్డి చంద్రశేఖరరెడ్డి

## నెల్లూరు ముచ్చట్లు

### టౌన్‌లో చోరీలు

5తేది రాత్రి యం.జె. వేలు మొదలియారు స్టోరులో పెట్టి వుంచిన షుమారు 2,700ల రొక్కం చోరీ అయినది. ఆ షెడ్లో పనిచేస్తుండిన కె. నాగేశ్వరరావు అనే యువకుని మీద అనుమానం.

***

### చిత్రజగత్

#### పరమానందయ్య శిష్యులు

తన స్వంత దర్శకత్వం క్రింద హాస్య నటకాగ్రేసరుడు శ్రీయుత శివరావు 'పరమానందయ్య శిష్యులు' తయారు చేస్తాడని వినడంతోటే ఆంధ్ర దేశమంతా ఆతృతతో ఎప్పుడెప్పుడు పూర్తవుతుందా, ఏనాడు దర్శించేభాగ్యం లభిస్తుందా, ఎవ్వాళ్లకు చిన్ననాడు ముచ్చట్లలో చెప్పుకొని ఆనందించిన కథలన్నీ తెరమీద చూడగలుగుతామా అని ఎదురు చూస్తున్నారు.

# నెల్లూరుసంగతులు

4వ పేజీ తరువాత

ఉక్కిరి, బిక్కిరి చేసేస్తున్నాయి. దీంతో ఛాలీవాలని జీతాలు, దిన కూలీలతో బతుకు వెళ్లబుచ్చే కుటుంబాల పరిస్థితి అగమ్యగోచరంగా తయారయ్యింది. మూడు నెలల వరకు ఒక మొత్తరుగా కరెంట్ వాడుకొనే వారికి రెండు నెలలకు 250 రూపాయలు కరెంట్ బిల్లు వచ్చేది. అది ప్రస్తుతం రెట్టింపయ్యింది. 223 రూపాయలకు దొరికే గ్యాస్ సిలిండర్ ధరకు రెక్కలొచ్చి 263.50 పైసలయ్యింది. పెట్రోల్ లీటర్ ధర 28.39 పైసల నుంచి 31.25 పైసలయ్యింది. దీనికి తోడు డీజిల్ ధర కూడా పెరగడంతో ఆర్టీసి బస్సు ఛార్జీలు కిలోమీటరుకు రెండు పైసల లెక్కన పెరిగిపోయాయి. నెల్లూరుటౌన్‌లోని బస్సులు, ఆటోల ఛార్జీ కూడా పెంచేశారు. గతంలో టౌన్ బస్సులో మినిమం ఛార్జి 2.50. ప్రస్తుతం అది 3 రూపాయలయ్యింది. ఆటో ఛార్జి 4 రూపాయల నుంచి ఐదుకు ఎగబ్రాకింది. రేషన్ షాపులో కిలో 3.50 కిచ్చే బియ్యం 5.25 పైసలు కాగా, కిరోసిన్ లీటర్ 6 నుంచి 9 రూపాయలైపోయింది. ఈ సీజన్‌లో మునిసిపాలిటీ కూడా ఇళ్ల పన్నులు రెట్టింపు చేసింది. ఇళ్ల బాడుగలు పెరిగిపోతున్నాయి.

ధాన్యం రేట్లు తగ్గినా బియ్యం మసూరి రకం కిలో 17 రూపాయలు, సన్నాలు 15 రూపాయలు, లావులు 13 రూపాయలు నిలబెట్టి అమ్ముతున్నారు. డీజిల్ రేట్ల పెంపుదలతో నిత్యావసర వస్తువులు ధరలకు రెక్కలొచ్చాయి. మినపప్పు కిలో 35 రూపాయలు, పెసలపప్పు 25, పచ్చిశనగపప్పు 24, చింతపండు 34, ఎండు కొబ్బరి 40 రూపాయలై పోయింది. గత నెల చివరి వారం వరకు కిలో 3 రూపాయలకు దొరుకుతుండిన ఎరగడ్డలు విజయదశమి రోజు నుంచి 6 రూపాయలయ్యాయి. అదేమంటే ఎరగడ్డలు విదేశాల ఎగుమతికి అనుమతిచ్చారని భవిష్యత్తులో ఇంకా పెరుగుతాయని వ్యాపారస్తులు చెప్పి భయపెడుతున్నారు. సబ్బులు, టూత్‌పేస్టుల రేట్లు కూడా గతంలోకన్నా బాగా పెరిగిపోయాయి. 10 రూపాయలకొచ్చే వళ్లు రుద్దుకొనే సబ్బు లేకపోగా, వంద గ్రాముల టూత్‌పేస్టు 30 రూపాయల పైమాటే.

వర్షాలు పడ్డాయని కూరగాయల ధరలు కొండెక్కి కూర్చున్నాయి. టమోటాలు కిలో 10రూపాయలు, వంకాయలు 8, బెండకాయలు 8, క్యారెట్ 12, పందిరి చిక్కుడ్లు 15, మిర్చి 12, అల్లం 20 రూపాయలు నిలబెట్టి అమ్ముతున్నారు. ఎన్ని డబ్బులు జేబుల్లో పెట్టుకొని వెళ్లినా బజారుల నుంచి సంతృప్తికరంగా ఇంటికి తిరిగిరాని పరిస్థితులు. ఈ ధరలతో బ్రతికేదెట్లా?

## సాహిత్య సభలు

నెల్లూరు వర్ధమాన సమాజం నేతృత్వంలో ఈనెల 1, 2, 3, 6తేదీల్లో టౌన్‌హాల్లో పోతన, శ్రీనాథ, మరుపూరు కోదండరామిరెడ్డి, రేబాల శంకరరెడ్డి జయంతి సభలు జరిగాయి. బాపట్ల ఆర్ట్స్ అండ్ సైన్సు కళాశాల హిందీ శాఖాధ్యక్షులు డాక్టర్ కె.వి.ఎస్. ఆచార్యపోతన భాగవతం - భక్తితత్వంపై మాట్లాడారు. సభాపోషకులు దొడ్ల శ్రీనివాసులురెడ్డి తమ అర్ధాంగి శేషమ్మ స్మృత్యర్థంగా వక్తను సన్మానించారు. అగస్త్యరెడ్డి వంకురెడ్డి అధ్యక్షతన జరిగిన శ్రీనాథ జయంతి సభలో ఆంధ్ర విశ్వవిద్యాలయం తెలుగు ప్రొఫెసర్ డాక్టర్ మలయవాసిని శ్రీనాథుని స్త్రీ పాత్ర చిత్రణం గూర్చి సోదాహరణంగా వివరించారు. సభాపోషకులు పోలంరెడ్డి నరేంద్రరెడ్డి, యశోధర స్మృత్యర్థంగా నెలకొల్పిన ట్రస్టు ద్వారా వక్తను సన్మానించారు.

కళాప్రపూర్ణ మరుపూరు కోదండరామిరెడ్డి 98వ జయంతి సభను పి.వి. రమణారెడ్డి అధ్యక్షించగా ఉస్మానియా విశ్వ విద్యాలయం తెలుగు రీడర్ డాక్టర్ సుమతి, మరుపూరి సాహిత్యసేవను వివరించారు. మరుపూరు తరుణేందు శేఖరరెడ్డి వక్తను సన్మానించారు. 6తేది రేబాల శంకరరెడ్డి స్మృత్యంక సభకు డాక్టర్ కె. నరసింహారెడ్డి అధ్యక్షతన వహించగా, శతావధాని నరాల రామారెడ్డి మేఘ సందేశ కావ్యంపై మాట్లాడారు. శంకరరెడ్డి కుమారుడు బాబురెడ్డి వక్తను సన్మానించారు. అన్ని సభలకు స్వాగత, వందనాలు సమాజం కార్యదర్శి పొన్నాల రామసుబ్బారెడ్డి కావించారు.

## కలెక్టర్‌ను పొగిడిన వివేకా

తాను సృష్టించుకొన్న ప్రజాదర్బార్ కార్యక్రమాన్ని జిల్లా కలెక్టర్ ప్రవీణ్‌కుమార్ 9తేది స్థలం మార్చి జడ్పీ మీటింగ్ హాల్‌లో నిర్వహించారు. ఎల్లకొల్లలుగా అర్జీలొచ్చి పడ్డాయి. ప్రజాదర్బార్‌కు నెల్లూరు ఎమ్మెల్యే వివేకానందరెడ్డి మంది మార్బలంతో హాజరయ్యారు. మంచి కార్యక్రమం నిర్వహిస్తున్న కలెక్టర్‌ను ఎమ్మెల్యే మొదట పొగిడారు. తర్వాత తాను సృష్టించుకున్న ప్రజాపథంలో ప్రజలు రేషన్, ఇళ్ల పట్టాలు, ఇళ్ల స్థలాల గూర్చి ప్రజలు అర్జీలిచ్చారని, వాటికి డి.ఓ లెటర్స్ వ్రాసి అధికారులకు పంపినా చర్యలు లేవన్నారు. తను సమర్పించిన సమస్యలకు ప్రజాదర్బార్‌లోనైనా పరిష్కారం చూపమని ఒక మెమొరాండం ఇచ్చారు. తాను వీటి విషయమై పట్టించు కొంటానని కలెక్టర్, వివేకానంద రెడ్డికి హామీ ఇచ్చారు. కౌన్సిలర్లు పుట్టారామ కృష్ణారెడ్డి, షఫీ, అనిత, శాంతమ్మ, సల్మా బషీర్, యేలూరు పెంచల నరసింహం కూడా ఎమ్మెల్యే వెంట వెళ్లారు.

## 'నరునివాత పులి'

రసిక్

మన భాగ్యనగరంలో
ఏ నేత పేర ఒక 'జూ' వెలసి విలసిల్లుతున్నదో
ఆ నేత ఆత్మ ఘూర్ణిల్లుతుందీ
సరికొత్త వార్తవిని;
ఓం ప్రథమంగా ఈ జూలో
అర్థరాత్రి దుండగులు ప్రవేశించి
బోనులోని పులిని వధించి
పట్టుకెళ్లారు దాని తోలును
అంతర్జాతీయ మార్కెట్టులో అమ్మి
ఆరు లక్షలు గడించేందుకు;
ఆ పులి చేసిన హృదయ విదారక
ఆక్రందనలను విని
దాని కన్నతల్లి, పూర్ణగర్భిణితోసహా
తక్కిన బోనుల్లోని పులులు
తమ గాండ్రింపుబానలో గొల్లుమన్నాయి
ఆ సంఘటన వెనుక ఆహారం ముట్టడం మాని
బిక్కచూపులు చూస్తూ బెదురు గుండెలతో
'సత్యాగ్రహా'నికి పూనుకొన్నాయి

***

ఏ జంతు సంరక్షణ తమ ఉద్యోగాలకు
మూలాధారమో
ఏ జంతువులు తమను ఆత్మీయులుగా భావించి
నమ్ముకొన్నాయో
ఆ జంతువుల్లో ఒకదాన్ని
దారుణంగా వధించడం వెనుక
ఆ జూ సిబ్బంది కేమాత్రం హస్తమున్నదో
ఆ దుండగులెవరో, వారినెప్పుడు
వేటక్కించుకుంటారో
అదంతా పెరుమాళ్లకెరుక!

***

ఒక జూలో చర్మం కొరకు పులిని
'లాకప్ డెత్'కు గురిచేయడం
ఆంధ్రదేశంతోనే ఆరంభమైనదని
అది మన రాష్ట్రానికి తీరని మచ్చకాగలదని
ప్రభుత, జనత గుర్తించి దర్యాప్తుసాగించి
ఆ హంతకులను పట్టి, సత్యాగ్రహంలో వున్న పులులకు
ఆహారంగా వేస్తే చాలు
న్యాయదేవత పులకించి తీరుతుంది-

***

పులివాత నరుడుబడితే, అది ఆ పులి ఆహారం కొరకు
నరునివాత పులిబడితే, అది ఆ పులి ఆరులక్షల చర్మం కొరకు
అణాకానీ విలువ చేయని చర్మంగల నరుని చేతిలో
అమూల్యమైన చర్మం గల పులి
ఒక తోలు బొమ్మ, ఒక కీలుబొమ్మ!!



శ్రీనాథ జయంతి సభలో వక్త ప్రొఫెసర్ మలయవాసినిని సన్మానిస్తున్న వారగోపాల్‌రెడ్డి. ఫోటోలో పొన్నాల రామసుబ్బారెడ్డి, వెంకురెడ్డి తదితరులున్నారు

## ఆర్ఎస్ఎస్ జనజాగరణ

రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ్ స్థాపించబడి 75 సంవత్సరాలు పూర్తయిన సందర్భంగా జనజాగరణ కార్యక్రమాన్ని ప్రారంభించనున్నారు. ఈ కార్యక్రమం అక్టోబర్ 15తేది నుంచి 30తేది వరకు జరుగుతుంది. ఆర్ఎస్ఎస్ కార్యకర్తలు జిల్లాలోని 1200 పంచాయతీల్లో ప్రతి ఇంటికి వెళ్లి సంఘ ఆశయాలను, సంఘ కార్యక్రమాలను వివరిస్తారు. ఈ కార్యక్రమంలో 2వేల మంది ఆర్ఎస్ఎస్ కార్యకర్తలు పాల్గొంటారు. నవంబర్ 26, 27తేదీలలో ఆర్ఎస్ఎస్ అధినేత సుదర్శన్‌జీ నెల్లూరు వస్తారని, రెండు రోజులపాటు జరిగే కార్యకర్తల శిబిరంలో పాల్గొంటారని జిల్లా సంఘ చాలక్ రామదండు చెప్పారు.

## శ్రీ రామాయణం గ్రంధావిష్కరణ సభ

పోలూరు హనుమజ్జానకి రామశర్మ రచించిన 'శ్రీరామాయణం' గ్రంథాన్ని 7తేది టౌన్‌హాల్‌లో ఇనమడుగు ఆశ్రమాధిపతి బ్రహ్మానందతీర్థ స్వామి ఆవిష్కరించారు. కావ్యాన్ని ప్రొఫెసర్ శలాక రఘునాథశర్మ సమీక్షిస్తూ వాల్మీకి రామాయణం ప్రమాణంగా గ్రహించి మూలవిధేయంగా శర్మ రచించిన కావ్యంలో తొమ్మిదివేలకుపైగా పద్యాలున్నాయి. వీటి రచనా విధానం అత్యద్భుతంగా ఉందన్నారు. ఆర్షధర్మ గ్రంధ ప్రచారమండలి ఈ సభను నిర్వహించింది.

## పర్యాటక కేంద్రాలను అభివృద్ధి చేస్తాం!

ఆంధ్రప్రదేశ్‌లో పర్యాటక కేంద్రాలను అంతర్జాతీయ స్థాయిలో అభివృద్ధి పర్చడానికి ప్రభుత్వం కృతనిశ్చయంతో ఉందని రాష్ట్ర టూరిజం శాఖ మంత్రి ఇ. పెద్దిరెడ్డి చెప్పారు. కళింగపట్టణం నుంచి తెరచాప పడవలో కృష్ణాపట్నం చేరిన భారత సైనిక బృందాన్ని 10తేది మంత్రి స్వాగతించి, నెల్లూరు గోల్డన్ జూబ్లీ హాల్‌లో అభినందనసభ జరిపారు. ఈ సందర్భంగా మంత్రి మాట్లాడుతూ సింగపూర్ గతంలో చిన్నదీవి. ఎటువంటి వనరులు లేవు. ఈ ప్రదేశాన్ని అంతర్జాతీయ టూరిజం కేంద్రంగా అభివృద్ధి చేయడంతో ఆ దేశ ఆదాయం 75శాతం టూరిజం వల్లే వస్తుందన్నారు. జిల్లాలోని తూపిలిపాళెం, కోడూరు, మైపాడు బీచ్, కృష్ణాపట్నం ఓడరేవులను అభివృద్ధి చేయాల్సిన అవసరం గూర్చి ప్రభుత్వానికి నివేదిక పంపినట్లు చెప్పారు. సమాజంలో నెల్లూరు ఎమ్మెల్యే వివేకానందరెడ్డి, కలెక్టర్ ప్రవీణ్‌కుమార్ కూడా పాల్గొన్నారు.

## చిత్రసమీక్ష

9వ పేజీ తరువాత

అయినా భారతదేశాన్ని మనస్ఫూర్తిగా ప్రేమిస్తాడు. దేశాభివృద్ధికి శ్రమిస్తాడు. ఈ పాత్రను ప్రకాష్‌రాజ్ గొప్పగా పోషించాడు. సరిహద్దు ఆవల నుంచి వచ్చిన దేవా ఉరఫ్ దావూద్ పాత్ర కూడా బాగా ఆకట్టుకుంటుంది. ప్రపంచంలో ఏ శక్తి తన వ్యక్తిత్వాన్ని దెబ్బతియ్యలేదని విర్రవీగే పాత్ర ఇది. ఈ పాత్రలో రఘువరన్ రాణింపు పొందాడు. బ్రహ్మానందం హాస్యం మామూలే.

పరుచూరి బ్రదర్స్ మాటలు ప్రత్యేకతను సంతరించుకున్నాయి. ఛోటా కె.నాయుడు కెమరాను గురించి ప్రత్యేకించి చెప్పనవసరం లేదు. మణిశర్మ సంగీతం అటు నేపథ్యంలో సన్నివేశాలకు బలం చేకూరుస్తూ ఇటు పాటలకు మాధుర్యం పులిమింది.

సమాజంలోని అన్యాయాలను, అక్రమాలను ఎదుర్కొనే ఈ చిత్రాన్ని యువకులంతా చూసి చైతన్యవంతులు కావటం అవసరం.

## సంసారి

9వ పేజీ తరువాత

నటిస్తుంది. ఈ విషయమై చెన్నైలో ఒక విలేఖరి మమతను ప్రశ్నిస్తూ మళ్లీ గొడవల్లో ఇరుక్కొంటారా అని ప్రశ్నించారు. దీనికి జవాబుగా నేను 'ఏం చేసినా సంచలనంగా ఉండాలను కొంటాను, అప్పుడే ప్రజలు మనల్ని పట్టించుకొంటారు. ఈ గొడవలు మామూలే; వీటికి భయపడితే ఎలా' అని పెదవి విరిచింది.

## డి.ఎస్.సి

4వ పేజీ తొరవ

అధికారులు పసిగట్టేస్తారని యెంచి చెవుడు వున్నట్లు సర్టిఫికెట్లు దాఖలు చేశారు. సర్టిఫికెట్ల వెరిఫికేషన్ సమయంలో ఏ విధమైన పరిశీలన జరపకుండా డాక్టర్ సర్టిఫికెట్ ఆధారంగా ఈ అప్లికేషన్లను అధికారులు స్వీకరించడంతో అంతా సజావుగా జరిగిపోయింది.

నెల్లూరు పెద్దాస్పత్రిలో కుంటి, గుడ్డి, మూగ, చెవుడు సర్టిఫికెట్లను ఏడాది పొడవునా 15 మందికి మించి ఇవ్వరు. కాని టీచర్స్ రిక్రూట్‌మెంట్ దరఖాస్తులు స్వీకరించిన జూలై నెలలో ఏకంగా 98 సర్టిఫికెట్లు ఇచ్చేశారు. పెద్దాసుపత్రిలో సహజంగా ఈ సర్టిఫికెట్లను డాక్టర్ తిరుపాల్ ఇస్తారు. ఈ డాక్టర్ సెలవు పెట్టడంతో ఇన్‌ఛార్జ్ డాక్టర్‌గా టి.బి. హాస్పిటల్ నుంచి వచ్చిన ఎస్.సుబ్రహ్మణ్యం, డబ్బుకు కక్కుర్తిపడి సర్టిఫికెట్లను విరివిగా ఇచ్చేశారు. సహజంగా రెండు చెవులకు 70 డెసిబుల్స్‌ను మించిన శబ్దం కూడా వినపడక పోతే అప్పుడు చెవుడు వున్నట్లు సర్టిఫికెట్ ఇవ్వాలి. ఈ విషయాన్ని పరిశీలించేందుకు ఆడియో మీటర్ అనే పరికరాన్ని ఉపయోగించాలి. పెద్దాసుపత్రిలో అసలు ఈ పరికరమే లేదు. అయినా ఈ కక్కుర్తి డాక్టర్ 15వేల నుంచి 20వేల రూపాయల వరకు డబ్బులు తీసుకొని ఈ సర్టిఫికెట్లు ఇచ్చేశారు. ఈ సర్టిఫికెట్లు తీసుకున్నవారు ఓ మోస్తరుగా డిఎస్‌సి పరీక్ష వ్రాసి వున్నా రేపు ఉద్యోగం ఖాయం. వాస్తవంగా ఏళ్ల తరబడి కష్టపడి, వేలకు వేలు ఖర్చు పెట్టి చదివిన వారికి అన్యాయం జరిగిపోయింది. డిఎస్‌సి ఫలితాలు ప్రకటించే ముందుగానే ఈ సర్టిఫికెట్ల భాగోతంపై జిల్లా కలెక్టర్ ప్రత్యేక విచారణ చేయిస్తే ఎంపికలో వాస్తవ నిరుద్యోగులకు న్యాయం చేసిన వారవుతారు.

## వెలమ విద్యార్థులకు స్కాలర్ షిప్పులు

ఈ విద్యా సంవత్సరం 7, 10, ఇంటర్, డిగ్రీ క్లాసులు చదివే వెలమ కుల విద్యార్థులకు స్కాలర్ షిప్పులను జిల్లా వెలమ సంఘం ఇస్తుంది. ఆసక్తిగల విద్యార్థులు వెలమకుల మండల అధ్యక్షుల ద్వారా దరఖాస్తులను ఈ నెల 31తేది లోగా పురిణి శ్రీనివాసులు, అధ్యక్షుడు జిల్లా వెలమ సంఘం, పోలీస్ కాలనీ, ఎకె.నగర్, నెల్లూరు -4 చిరునామాకు పంపాలని కోరుతున్నారు.

## పోటీలకు విఆర్ విద్యార్థులు

మహారాష్ట్ర, కేరళ రాష్ట్రాల్లో జరిగే సౌత్‌జోన్ అంతర్ విశ్వ విద్యాలయాల ఖోఖో, ఫుట్‌బాల్ క్రీడోత్సాల్లో పాల్గొనే ఎస్వీ యూనివర్శిటీ జట్టుకు నెల్లూరు విఆర్ కళాశాల క్రీడాకారులు ఎంపికయ్యారు. ఇటీవల కడపలో ముగిసిన ఎస్వీ యూనివర్శిటీ అంతర్ కళాశాలల క్రీడోత్సవాల్లో తగిన ప్రతిభచూపిన విఆర్ కళాశాల క్రీడాకారులకు యూనివర్శిటీ జట్టులో జిల్లా నుంచి తగిన ప్రాతినిధ్యం లభించింది. 19తేది నుంచి కాలికట్ యూనివర్శిటీలో ప్రారంభం కానున్న ఫుట్‌బాల్ పోటీల్లో పాల్గొనే యూనివర్శిటీ జట్టులో విఆర్ కళాశాలకు చెందిన బాలకృష్ణ, కిషోర్, టి. భాస్కర్‌రావు, ఎం.హరి, ఆర్. కిరణ్ కిషోర్ ఎంపికయ్యారు. మహారాష్ట్రలోని అమరావతి యూనివర్శిటీలో జరిగే ఖోఖో క్రీడోత్సవాల్లో యూనివర్శిటీ జట్టులో విఆర్‌సి విద్యార్థి షేక్. షఫీ రెండవసారి ఎంపికయ్యాడు.

## రక్తసహాయోద్యమంలో పాతికేళ్ల ప్రస్థానం



సింహపురి స్వచ్ఛంద రక్తదాతల బృంద స్థాపకుడు తిక్కవరపు సుకుమార్‌రెడ్డి రక్తసహాయోద్యమంలో ప్రవేశించి 4తేదికి పాతికేళ్లయ్యింది. 1975 సంవత్సరంలో విఆర్ కాలేజి విద్యార్థిగా అక్కడి జాతీయ సేవాపథకంలో నాయకునిగా వుంటూ, తొలిసారిగా జాతీయ రక్తసహాయ వారోత్సవాల సందర్భంగా రక్తదానం చేశారాయన. అప్పటి నుంచి ఇప్పటి వరకు 35సార్లు స్వయంగా రక్తదానం చేశారు. వీటిలో 33సార్లు అత్యవసరంగారక్తం కావాల్సి వచ్చి అడిగితే వెళ్లి ఇచ్చారు. ఈ పాతికేళ్లలో 1,500 వరకు రక్తసహాయాలు దగ్గరుండి చేయించారు. దీనికితోడు నెల్లూరు నేత్ర దాతల సంస్థ, పినాకిని దేహ సమర్పకుల సంస్థలు సుకుమార్‌రెడ్డి స్థాపించినవే. సుకుమార్‌రెడ్డి మంచి రచయిత, వక్త. సారావ్యతిరేకోద్యమం వంటి ఉద్యమాల్లో పాల్గొన్న అభ్యుదయ భావకుడు. భవిష్యత్తులో మరెన్నో సంస్థల ఆవిర్భావకుడు కావాలని మనసారా కోరుకొంటున్నాం.

## లంచాల ఆకలి

5వ పేజీ తొరవ

ఇప్పించే బాధ్యత వెంకటగిరి ఎస్ఐదట. ఆయన రాను పోను టిక్కెట్ల భారం గూడూరు వన్‌టౌన్ పోలీస్ స్టేషన్ భరించాలట. నెల్లూరులోని ప్రముఖ కోచింగ్ సెంటర్‌లో శిక్షణ పొందే ఈయన కుమారునికి రెండు రోజులకొకసారి మినరల్ వాటర్ క్యాన్లు తీసుకెళ్లి ఇచ్చే బాధ్యతను ఇద్దరు కానిస్టేబిళ్లకు అప్పగించారట. తెలంగాణాలో ఉన్నప్పుడు లెక్కలేనన్ని ఎన్‌కౌంటర్లు చేసిన అధికారి కావడం వల్ల ఈయన నక్సలైట్ల హిట్‌లిస్టులో వున్నారట. అందుకోసం సెక్యూరిటీగా ఆరుమంది గన్‌మ్యాన్ లుంటారు. సామాన్యులెవరినీ ఫిర్యాదు చేయను ఆయన వద్దకు పంపరు. డబ్బు లెక్క తప్ప, శాంతి భద్రతల పరిరక్షణ విషయాన్ని డిఎస్పీ ఎప్పుడో మర్చిపోయారు.

## లాభాలబాటలో ఆత్మకూరు ఆర్టీసి డిపో

ఆత్మకూరు ఆర్టీసి డిపోకు ఈ యేడాది ఆగష్టు నెల వరకు 25లక్షలు ఆదాయం వచ్చిందని డిపో మేనేజర్ వై. శ్రీనివాసరావు చెప్పారు. డిపోలోని తన కార్యాలయంలో విలేఖరులతో మాట్లాడుతూ, ఆరు మాసాల క్రితం డిపో ఆదాయం 10లక్షలు వుండిందని, ప్రత్యేక శ్రద్ధ తీసుకోవడం వల్ల మరో 5లక్షలకు పెరిగిందన్నారు. ఆత్మకూరు నుంచి బెంగుళూరు వెళ్లే ప్రత్యేక ఆర్టీసి బస్సు 21తేది నుంచి మెయిన్ రూటులో మర్రిపాడు, బద్వేల్, కడప మీదుగా బెంగుళూరుకు పోతుందన్నారు. గతంలో ఈ బస్సు అనంతసాగరం మీదుగా బెంగుళూరు వెళ్లేది. ఆత్మకూరు నుంచి రాత్రి 9.30 గంటల ప్రాంతంలో సోమశిలకు ప్రత్యేక బస్సును ఏర్పాటు చేసినట్లు చెప్పారు. ఈ బస్సు ఉదయం 6 గంటలకు సోమశిలలో బయలుదేరి ఆత్మకూరు, నెల్లూరు మీదుగా తిరుపతి వెళ్తుందన్నారు. రాత్రిపూట నెల్లూరులో ఆత్మకూరుకు 9.30 ప్రాంతంలో ఆర్డినరీ బస్సు బయలు దేరుతుందన్నారు. ఆత్మకూరు నుంచి ఉదయం 5.45 నిమిషాలకు అనంతసాగరం మీదుగా బద్వేల్‌కు సర్వీసును ఏర్పాటు చేసినట్లు చెప్పారు.

## ముఖ్యమంత్రి

మొదటి పేజీ తొరవ

హెచ్చింపుకు ప్రయత్నించినా యావత్ రాష్ట్రం ఉధృతంగా తిరుగుబాటుకు పూనుకోవడం ఖాయం. చంద్రబాబు గుర్తించుకో వలసిన వాస్తవం అది. ఎల్లకాలం ప్రజలను మోసగించడం అసాధ్యం. *

## ఉత్తరక్రియలు

మంచికి మారుపేరుగా నిలిచి, మమతానురాగాలను
అందరికీ పంచియిచ్చి, మా అభివృద్ధి కోసం ప్రతి నిముషము పరితపిస్తూ,
మమ్ములనీ ఉన్నత స్థితికి చేర్చిన మచ్చలేని మనిషి, మా యింటి వెలుగు

## ఉమ్మారెడ్డి వరదారెడ్డి గారు

(మాజీ కౌన్సిలర్, నెల్లూరు మునిసిపాలిటీ)

1.10.2000 తేది ఆదివారం స్వర్గస్థులైరి.
వారు లేని లోటు మాకెవ్వరూ తీర్చలేనిది.
వారి ఆత్మకు దైవసన్నిధిన చిరశాంతి కలగాలని ప్రార్థిస్తున్నాము.

### ఉత్తరక్రియలు

19.10.2000 తేది గురువారం పెద్దకర్మ
నెల్లూరు, రామలింగాపురం, భారతీ జూనియర్ కాలేజి దగ్గర్లోని
మా వసతి గృహమున జరుగును. బంధుమిత్రులు తెలియగోరుతాము.

ఉమ్మారెడ్డి వరదారెడ్డి
కాంట్రాక్టరు మరియు మాజీ కౌన్సిలర్, నెల్లూరు మునిసిపాలిటీ

భార్య: ఉమ్మారెడ్డి సరోజనమ్మ

కుమారుడు - కోడలు: చంద్రశేఖరరెడ్డి - భారతి

కుమార్తె - అల్లుడు: కొండా చాముండేశ్వరి - శేషారెడ్డి

మనుమరాళ్ళు - మనుమడు: స్నిగ్ధ, విశ్వధ, చైతన్య, శ్రీదివ్య

తమ్ముడు - మరదలు: శ్రీనివాసులురెడ్డి - రాజేశ్వరమ్మ

తమ్ముడి కుమార్తెలు - అల్లుళ్ళు: అనవల్లి భాగ్యలక్ష్మి - ఆదిశేషారెడ్డి
డా. నల్లపరెడ్డి భారతి - శ్రీకాంత్ రెడ్డి
డా. బైనగారి భవాని - విజయభాస్కర్ రెడ్డి

తమ్ముడి మనుమడు - మనుమరాలు: ఆదర్శ్, రిషిక

Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. Ph: 091-861-327354, Offset Printing at Zaminryot Press, Nellore.